ఆంధ్రసచిత్రవార
# పత్రిక

## ఉగాది సంచిక

'నేటి మన సినిమాలు' వ్యాసరచన
పోటీ ఫలితాలు; ఫిలిం బాలెట్



# ఉత్తరాలు

## కార్టూనులు

శ్రీ బాపుగారి 'రంగారావు' వర్ణన చూచి అమితానంద పడ్డానంటే నమ్మండి ఈవిధంగా వ్రాయడం వల్ల బాపుగారికి ఎంతో చాకచక్యం ఉన్నట్లుగా తోస్తుంది

కె మోహన్‌రెడ్డి (నల్లగొండ)

* * *

ఆంధ్రులైన శ్రీ పాణిగారు లుంగీ కట్టినట్లు కార్టూన్లలో చూశాను నిత్య జీవితంలో పాణిగారు పంచ కట్టరా ? లేక బాపుగారు పరాకు చిత్రించారా ?

గుమ్మడవు రమాదేవి (రామచంద్రపురం)

ఏమో! చెప్పలేము

* * *

బాపుగారు తమ కార్టూన్ల ద్వారా రంగారావు గారిని బహు చక్కగా పరిచయం చేశారు రంగారావుగారికి ఒక ప్రత్యేకత నిచ్చారు ప్రతి కార్టూన్ లోనూ పరిచయంచేసే వ్యక్తి పేరు ఒక్కసారి మాత్రం రాగా, రంగారావుగారిపేరు ప్రతి పంక్తిలోనూ (ఒక పంక్తిలో తప్ప) వచ్చేలా చేశారు మొత్తముమీద వీ కార్టూనులుగాని బాపుగారి కార్టూనులకు పోటీకరంగా రావు

జి వి శ్రీధర్ (మద్రాసు)

## చదువుల్రావు

నాదొక చిన్న అనుమానం; మన చదువుల్రావుకి "షార్ట్ సైటా ?" 'లాంగ్‌సైటా ? ఎప్పుడూ కళ్ళకి అద్దాలు పెట్టుకుంటాడు!

వి ఆర్ అంగర (ముషీరాబాదు)

## కథ కాని కథ

దినపత్రిక వెల 0 07 న పైసలు అయి ఉండును కాని, ఇక్కడ ఖరీదు గుంటూరులో 0 07 నయాపైసలని అనుకొనను

చదువరులు నా సందేహాన్ని తీరుస్తారని ఆశిస్తున్నాను

బ్రహ్మచారుల సమాజం సభ్యుడు (కొవ్వూరు)

## మన రాష్ట్రం

శ్రీ కౌండిన్యగారు ప్రస్తుత మంత్రివర్గ నిర్మాణాన్ని సమీక్షిస్తూ ఆంధ్రపత్రిక అభిప్రాయాలను ప్రతిబింబించారు వారి సమీక్ష పత్రిక అభిప్రాయాలకు అనుగుణముగానే వున్నది 'శ్రీ రెడ్డిగారు కేంద్రగేను అధ్యక్షులవడంవల్ల విశాలదృష్టి అలవడినది మంత్రివర్గంలో కూడా వైశాల్యం కన్పిస్తూంది కనుక ఏ విధంగా చూచినా యీ మంత్రివర్గం విమర్శనాతీతం 'అని శ్రీ కౌండిన్యగారు వ్యంగ్యముగానైనా, వాస్తవాన్ని అంగీకరించినందులకు అభినందనీయులు ఇక ముందు కూడా వారు యిలా వ్యంగ్యముగానైనా వాస్తవ విషయాలు అందజేయగలరని ఆశిస్తున్నాను

దాసి కాశీనాథ్ (హిందూపురం)

## భూగర్భంలోనికి సాహసయాత్ర

ఎందుకనో ఈవారం దనిలోని భాష బాగుండ లేదు వాక్యముల అంతము లన్నియు భవిష్యత్ కాలాన్ని సూచిస్తున్నట్లున్నవి మరి ఇది అచ్చు తప్పో మరింకేదైనా తప్పో తెలియుటలేదు

చిల్లర హనుమద్రంగారావు (సికింద్రాబాదు)

మూలంలో అలా ఉన్నది

## కథలు

ధనిష్ఠగారు వ్రాసిన కథలనుబట్టి చూస్తూ ఉంటే వారిది మావూరేనేమో ననిపిస్తోంది

దేవకీచలం (కాకినాడు)

అయివుండవచ్చు

* * *

"సారీ లేదు లారీ లేదు తెంపకాయ కొట్టి క్షమించమన్నాట్ట వెనకటి కోడు" అన్న వాక్యాన్ని— బాగా రచించారు అపై వాక్యంలోనే ఆ ఆలు మగల అనురాగం — ఎంతో ఉంది ఆ వాక్యం నన్ను నవ్వించింది లోకంలోని అందరూ "ఆలు మగలు 'ఇలాగే" ఉంటే ఎంతో బావుండేది

ఆర్ మణి (సికింద్రాబాదు)

* * *

కృష్ణ తల్లి తన 'అంతరం' చూసుకొని బాధ పడ్డట్లు రచించిన కథ చాలా ఇంపుగా చదువుటకు సొంపుగా ఉన్నది రచయితకు నా ధన్యవాదాలు

ఎస్ రమణయ్య (శిద్దుగారిపల్లె)

* * *

కృష్ణ ప్రియంవదల అన్యోన్యతను చూచి ఆనందపడ్డాను రచయితకు నా ధన్యవాదాలు

కనిగెల్పుల బాలజీ (మద్రాసు)

* * *

"ధనిష్ఠ" గారి కథానిక హృదయాన్ని కదిలించేదిగా ఉంది వారి రచనా శైలి కాల్పనిక శిల్ప చాతుర్యం పాత్రల సహజ లాలిత్యం ఉద్రూతలూగించింది

వారి అంతరం చదువుతున్నంతసేపు అందులోని కృష్ణ" పాత్ర "నేనే' అయితే ఎంత అదృష్టవంతు న్నానిపించినది

దేశిక భాస్కర రామమూర్తి (హైదరాబాదు)

* * *

శ్రీ కాంతశర్మగారి కథలో "చలి జిలజిల లాడిస్తోంది అని వ్రాశారు చలి గడగడ లాడిస్తోంది లేక గజగజ లాడిస్తోంది అంతేకాని జిల జిల లాడించదు

'రాధ (రామచంద్రపురం)

* * *

కథల్లో (చలన) చిత్రభాషే కనబడుతుందికాని సహజ సంభాషణలు కనబడవు పరిస్థితి మరీ దిగ జారకుండా చూసి మావంటి అభిమానులకు నిరుత్సాహం కలుగకుండా చూస్తారని ఆశిస్తాను

వై శేషారావు (పెద్దాపురం)





శ్రీ ఆరుద్ర

## కాబోయే కథకులకు పనికొచ్చే చిట్కాలు

మా కార్యాలయానికి వచ్చే వ్రాతప్రతుల సంఖ్య చూస్తే రచనాభిలాష ఎందరికి ఉన్నదో తెలుస్తున్నది కాని వీటిలో చాలామట్టుకు—మాకు కష్టమే అనిపించినా!—తిప్పివేయవలసి వస్తున్నది

ఈ యువ రచయితలకు అనుభవం తక్కువని స్పష్టం అవుతున్నది చిన్నవిషయాలు కొన్ని గమనించినట్లయితే వీరిలో చాలామంది చక్కటి కథలు వ్రాయగలరనిపిస్తుంది

అందుకని కథారచనకు తోడ్పడే సూత్రాలు కొన్ని సేకరించి యువరచయితలకు అందచేస్తే బాగుంటుందనుకున్నాము అనుకున్నదే తడవుగా ప్రఖ్యాత రచయిత శ్రీ ఆరుద్ర సహాయం అర్థించాము ఆయన వెంటనే ఒప్పుకున్నారు

క్రొత్త రచయితలకు ఉపయోగకరంగాఉండే చిన్న పుస్తకం ఒకటివ్రాసి ఇస్తామన్నారు

ఈ పుస్తకంలో బొమ్మలు వేయడానికి శ్రీ బాపు అంగీకరించారు

వీ రిద్దరి సహాయంతో యారుచేసిన ఈ పుస్తకం పేరు 'కాబోయే కథకులకు పనికొచ్చే చిట్కాలు '

పోస్టేజికని ఎనిమిది నయాపైసల స్టాంపులు పంపేవారికి దీనిని ఉచితంగా ఇవ్వదలచాము కొద్ది కాపీలు మాత్రమే అచ్చు అవుతున్నాయి కాబట్టి కథారచనకు చిట్కాలు తెలుసుకోదలచినవారు వెంటనే స్టాంపులు పంపగోరుతాము!



# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు


## విషయానుక్రమణిక


శుక్రవారం : *6-4-62*

శుభ॥సం॥ చైత్ర మా॥శు॥ విదియ

సంపుటము : 54 సంచిక . 31

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై
సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1






ముఖచిత్రం :
పండుగ ముస్తాబు

## లోకంపోకడ




"నీవు కమ్యూనిస్టుకు ఓటుఎందుకు వేశావ ?"
"తంతారని భయంబాబూ!"







కాంగ్రెసు అధ్యక్ష పదవి ఎవ్వరికీ అక్కరలేదు ఎందుకో!



# కాలంతీరిన పార్లమెంటు కార్యకలాపాలు: రాష్ట్రవ్యవస్థలపై ఆర్థికసంఘం అక్షింతలు

శ్రీ కృష్ణ

పార్లమెంటు రథం మందగమనంతో గమ్యస్థానం చేరుకుంటున్నది. రాజ్యాంగరీత్యా దాని ప్రయోజనం తీరిపోయింది. ప్రస్తుత లోకసభ రద్దు కాగానే ఏర్పడే అజ్మాయిషీ ప్రభుత్వానికి ఈ పార్లమెంటు ద్రవ్యం సమకూర్చిపెడుతున్నది. ఈ ధనంతో మే నెలాఖరు వరకు అజ్మాయిషీ ప్రభుత్వం పనిచేస్తుంది. ఆటు తరువాత కొత్త పార్లమెంటులో కొత్త ఆర్థిక మంత్రి కొత్త ఆర్థికబిల్లు ప్రవేశ పెడతారు.

ప్రస్తుత విధానంలో అసందర్భమైన విషయాలు కొల్లలుగా ఉన్నాయి. సార్వత్రిక ఎన్నికలు దాదాపు పూర్తి అయిన తరువాత పాత పార్లమెంటు సమావేశమైంది. కొత్త లోకసభ ఇంకా ప్రమాణస్వీకారం చెయ్యలేదు. పాత పార్లమెంటు తుది సమావేశాన్ని ప్రారంభిస్తూ రాష్ట్రపతి ఒక ఉపన్యాసంచేశారు. మరో మూడువారాల తరువాత కొత్త పార్లమెంటు తొలి సమావేశాన్ని ప్రారంభిస్తూ రాష్ట్రపతి మరొక ఉపన్యాసం చేస్తారు. ఆదాయానికి మించిన ఖర్చు చూపుతూ ఆర్థిక మంత్రి బడ్జెట్ ప్రతిపాదించారు. సహజంగానే యీ పార్లమెంటు ముఖ్యమైన నిర్ణయాలు ఏవీ చేసే వీలులేదు. దీని కాలం తీరిపోయింది. అంత్యక్రియలు మాత్రం జరుగవలసి ఉన్నాయి.

*　　*　　*

నూతనంగా ఏర్పడే ప్రభుత్వ వ్యవస్థను గూర్చి కొన్ని విషయాలు ఖచ్చితంగా చెప్పవచ్చు. పండిత జవహర్‌లాల్ నెహ్రూ మళ్లీ ప్రధాన మంత్రి అవుతారని నిస్సంకోచంగా అనుకోవచ్చును. శ్రీ లాల్ బహదూర్‌శాస్త్రి దేశీయ వ్యవహారాల మంత్రిగా ఉంటారని కూడా నమ్మవచ్చు. డా. రాధాకృష్ణన్ రాష్ట్రపతి అవటం ఖాయం. శ్రీమతి విజయలక్ష్మి ఉపాధ్యక్షురాలు (ఉపరాష్ట్రపతి) కాకపోవటం కూడా ఖాయమే. ఇతరత్రా ఏమి అనుకున్నా ఊహాగానాలు అవి మాత్రమే.

*　　*　　*

ఆర్థికసంఘం, రాష్ట్రాల పరిపాలనా వ్యవస్థలను, అదనపు రెవెన్యూలు సేకరించడం పట్ల ఆ వ్యవస్థల నిర్లిప్తతను ఘాటుగా విమర్శించింది. ఈ సంఘం తమ నివేదికలో ఇలా వ్రాసింది. "కేంద్రప్రభుత్వం లభింపజేసే ఆర్థిక వసతులతోను, గ్రాంట్లతోను తమ సాలుసరి బడ్జెట్ లోటు భర్తీచేసుకోవచ్చనే ధీమా రాష్ట్రాలకు కలిగింది. అందుకే సవాలక్ష కారణాలు చెప్పుకుని, గ్రామసీమలలో నైతేనేమి, ఇతర రంగాలలో నైతేనేమి రాబడి వసతులను అభివృద్ధి పరచుకొనడానికి విముఖత చూపుతున్నాయి. సిబ్బంది కోసం సరఫరాలకోసం చేసే ఖర్చులపై ఇదివరకు మాదిరిగా ఇప్పుడు తగిన అదుపులేదు. ఉద్యోగుల సంఖ్య విస్తృతం అవుతున్నది. జీతాలు పెంచుతున్నారు. అవసరమైన వస్తువులు సేకరించడంలోను, పథకాలు అమలు చేయడంలోను అదుపులేక నిర్లక్ష్యం ప్రబలుతున్నది. ప్రణాళికలో చేర్చదగు పథకాలను గూర్చి పరిశీలన, సంప్రదింపులు జాగ్రత్తగా సాగినా, సాలుసరి అంచనాల సంగతి పట్టించుకునేవారు లేరు. ప్రణాళికతో సంబంధంలేని ఖర్చుల పరిశీలనకు అఖిలభారత స్థాయిలో ఏ వ్యవస్థ లేదు. ప్రణాళికల మూలంగానే ఈ ఖర్చు నానాటికి పెరుగుతున్నది."



న్యూఢిల్లీ విజ్ఞానభవనంలో [illegible] కేంద్రసలహాసంఘానికి ఇటీవల ప్రధాని శ్రీ నెహ్రూ ప్రారంభోత్సవం జరిపారు.

"ఒక రాష్ట్రం అనుసరించే ఆర్థికవిధానాలు అపసవ్యంగా ఉన్నవంటే ఆ రాష్ట్రం అభివృద్ధికి అంతరాయం కలుగుటమే కాక, వాటి ప్రభావం పొరుగు రాష్ట్రాలమీద కూడా కన్పిస్తున్నది. ఇది ఆందోళనకరమైన సంగతి. ఉన్నతాధికారుల సిఫార్సుల మేరకు, ఒక రాష్ట్రంలో ఒక వర్గం ఉద్యోగుల జీతాల స్కేళ్లు బాగా పెంచారు. ఈ స్కేళ్లు అంతకు మునుపే దేశం మొత్తంమీద మెరుగుగా ఉన్నాయి. వాటిని సవరించారంటే, ఆ రాష్ట్రంలోనే ఇతర శాఖలమీద, పొరుగు రాష్ట్రాలమీద కలిగే ప్రభావం ఏమిటో సరిగ్గా ఆలోచించలేదనే అనుకోవలసివస్తుంది.

పన్నులు విధించటంలోకూడా పరిస్థితి ఇలాగే ఉన్నది. భూమిశిస్తు, అమ్మకంపన్ను, మోటారు వాహనాల పన్ను మొదలైన వాటిలో తేడాలు ఉంటున్నాయి. దేశ ఆర్థిక వ్యవస్థకు, గ్రామసీమలు ఇప్పటికంటే అధికంగా తోడ్పడే వీలు ఉన్నదని అంతా అంగీకరించినా, ప్రస్తుతం అమలులోఉన్న భూమిశిస్తు రేట్లు—గత 30—60 సంవత్సరాలనుంచీ సవరించకపోయినా—పెంచడంపట్ల సుముఖత కనిపించటంలేదు. ఒక రాష్ట్రంలో పరిమితమైన చర్య తీసుకున్నందువల్ల, పాత మదింపు పద్ధతులననుసరించే శిస్తు రేట్లు సుమారుగా పెంచేవీలు ఉన్నదని తెలిసింది. వెంటనే ప్రభుత్వం సెటిల్‌మెంట్ చర్యలు ఇంకా కొనసాగించటం వాంఛనీయం కాదని నిశ్చయించింది. ఆర్థిక వసతులు సమకూర్చుకోవలసిన అవసరం ఉన్న మరొకరాష్ట్రం అభివృద్ధి పన్ను ప్రవేశపెట్టింది. కాని, ఆ తరువాత పొరుగు రాష్ట్రాల్నిచూచి, దాన్ని రద్దు చేసింది. ఈ అన్ని కారణాలవల్లా, విధించతగు పన్నులు తగ్గటం, అనవసరమైన ఖర్చులు పెరగటం జరుగుతున్నది.

"కొంతవరకూ సమానత్వం సాధించే నిమిత్తం పన్నుల విధింపులోను, ఖర్చు కార్యక్రమాలలోను దేశం మొత్తంమీద కాకపోయినా, ప్రాంతాలవారీగా

—62వ పేజీ చూడండి

# మురళీ-
# ప్రియులే
# చీకటి



# హరివంశము

## హారీత శివశర్మ

### సాందీపనిపర్వం - 54

తాను అప్పుడు చేయబోవుచున్న పనినిగూర్చి ఆలోచించగా, మహానందునకే నవ్వు వచ్చెను పూర్వమెన్నడో, ఇక్ష్వాకుల కాలమునాడు, నక్షత్రకుడను ఒకానొక బ్రాహ్మణవటువు హరిశ్చంద్రుడను రాజును కాశికా క్షేత్రమున నమ్మకమునకు బెట్టెను ఆ రాజును బ్రాహ్మణులుగాని, మరి ఇతర అగ్రవర్ణములవారుగాని యెవ్వరును కొనలేదు ఒక్క కడజాతివాడు కొనెను ఇప్పుడు విచిత్రమేమనగా, తాను ఈ కడజాతివాని బంగారమును దానముగా గ్రహింపవలసినదని కాశికయందలి బ్రాహ్మణులను అర్థించబోవుచున్నాడు ఏ బ్రాహ్మణుడు పుచ్చుకొనును ఈ బ్రాహ్మణులలో నందరును దానములను పట్టరు కొందరు పట్టుదురు వారేమి దానమునైన పట్టుదురుగాని, కడజాతివాని, ధర్మముగా నార్జించిన బంగారమును గూడ ముట్టరు మరి వానిలో ఆత్మయన్నదిలేదా! వానిలో ఆత్ముడు ఆత్ముడు కాదా! ఇచ్చట శరీర మడ్డు వచ్చుచున్నది. జాతిఅడ్డము వచ్చుచున్నది జన్మమడ్డము వచ్చుచున్నది ఇవియన్నియు నేమి? జీవుని బంధించు బంధనములు? ఈ బంధనములలోనుండి యతడు ఆత్మారాముడు కావలయును ఎట్లు పొసగును సర్వబంధములను త్రెంపికొన్నచో నగును అవి యెట్లు తెగును? సర్వధర్మములను పరిత్యజించినచో తెగును? తన్ను తాను గ్రహించుకొన్నచో తెగును? ఇట్టి ఆలోచనములతో మహానందుడు మణికర్ణికకు. చేరిన బ్రాహ్మణులను దరిసెను వారితో ఇట్టు లనెను "అయ్యా! వాడుగో చూడుడు వాడు పంచజనుడు పంచముడు తన సర్వస్వమును కాశికలో విశ్వనాథ స్వరూపులయిన బ్రాహ్మణప్రవరులకు దానముచేసి కృతార్థుడుకాగా వచ్చినాడు వానిచేయు అర్పణము గ్రహించి, కాశీవిశ్వనాథుని, వానిని కృతార్థుల జేయరో?"

బ్రాహ్మణులు నవ్వినారు "ఎవరవు నీవు అవును. అవును సాందీపనియింటనుండు భికారి బ్రాహ్మణుడవు నీకు ధర్మములేదు. బ్రహ్మము లేదు నీవేదియైనను పుచ్చుకొందువు ఎమ్ముల నేల కడజాతివాని దానమును గ్రహించమందువు? మేము ఆహితాగ్నులము నీకు అగ్నియులేదు ఆహుతియు లేదు ఇది కాశికయ! ఇది గంగయొడ్డా! ఇది మణికర్ణికయా? ఇది విశ్వపతికి నివాసభూమియా? ఇది అవిముక్త క్షేత్రమా? ఇచ్చట నీవు బ్రాహ్మణులను కడజాతివానిచేతిదానమును గ్రహించవలసినదిగా, బ్రాహ్మణుడవు, అడుగుచున్నావా! మరి ఆ దానమును నీవేయేల గ్రహించరాదు" అనినారు

పంచజనున కిదియంతయు నాశ్చర్యమనిపించినది ఈ యడుగుచున్నదియు బ్రాహ్మణుడే ఆ చెప్పుచున్నదియు బ్రాహ్మణులే. ఒకరు దానమును గ్రహింపుడు అని మరియొకరిని అడుగుచున్నారు ఆ మరియొకరు నీవే యేల గ్రహించరాదు!—అని యడుగుచున్నారు ఈ బ్రాహ్మణులేమని ప్రత్యుత్తరీకరించునో! పంచజనుడు తాను నిలబడియున్న ప్రదేశమునుండి కొంచె మీవలకు వచ్చినాడు ఆ వచ్చుట ఆ బ్రాహ్మణులకు దాపునకు వచ్చినట్లాయినది. వారు, వానిని చురచుర చూసిరి. ఇట్లనిరి;

"ఏమిరా! క్రొవ్వు బలిసినదివలె నున్నది మరియు మీదిమీదికి వచ్చుచున్నావు నీవు గంగ ఒడ్డునకు వచ్చుటయే దోషము మరియు మణికర్ణికదగ్గరకు వచ్చితివి వచ్చితివి పో! డబ్బు గడించితినిగదా యని బ్రాహ్మణులమైన మే మిచ్చట నుండగా మీదిమీదికి వచ్చెదవా! తొలగు! దూరముగా తొలగు! లేదో! రాజుతో విన్నవించగలము"

పంచజనుడు మందహాసము చేయుగా, ఆ మందహాసము కైలాసము చివరికొమ్మున కంఠేకాలుని శిరఃకోటీర నివాసి బాలచంద్రముడు వికసించినట్లుండెను వాడు కంఠమును సవరించుకొని మాటలాడగా, పరమశివుడు కంఠము నావేశించియున్న విసమును బయటికి రానీక చేతితో అదిమి మరియు మాట్లాడినట్లు లుండెను వాడు వారితో ఇట్లు లనెను:

"స్వామి! తాము బ్రాహ్మణులు నేను ఎవ్వడను నా సర్వమును శివార్పణము చేసినాను ఈ శరీరము నాడా? దానినిగూడా శివునికి కైంకర్యము చేసినాను. మరి మీరు నన్ను తొలగుమనుచున్నారు. నన్ను అనగా నెవరిని! ఈ శరీరమునా! అది నేను కాదు మరి ఆ శరీరములోనున్న శరీరినా! ఆ శరీరి లేనిదెచ్చట? స్వామి! తాము ఎవ్వరిని తొలగమనుచున్నారు! విడమరచి చెప్పుడు!"

బ్రాహ్మణు లొకరి మొగము లొకరు చూచుకొనిరి పంచజనుడు మహానందుని దిక్కు చూచెను మహానందుని కన్నులలో ఆనందమో, జ్ఞానమో, ఏదియో భాసించెను పంచజనుడు మరల బ్రాహ్మణులను సంబోధించి యిట్లనెను:
"స్వామి! నేను కడజాతివాడను మీలో బ్రాహ్మణులు యాయవారమో, శిలోంఛమో వృత్తిగా మీలో కొందరుందురు మరి మీరందరు సమలోష్ట కాంచనులుగూడ నగుదురు. మరియు ఆహితాగ్నులు, ప్రతి నిత్యసోమపీథులుగూడ మీలోనుందురు. మీరు భూమియందు దేవతలు నేను ధర్మమార్గమున, నీ ధనమునంతయు గడించితిని చూడుడు! ఇవి సువర్ణపు దిమ్మలు ఇవి టంకముల జాలెములు ఇవి పాత్రములు ఇవి నాణెములు అన్నియు నిచ్చట రాగా పోసి యిమ్మన్న యిత్తును నేను కాశికకు రాగా, నా కడజాతి జన్మము జారిపోయినది ఇచ్చట యుండిరును శిశువులవలెనే నా కగుపించుచున్నారు నేను భక్తుడను నన్ను కృతార్థుని చేయరాదో!"

బ్రాహ్మణు లొకరి ముఖము లొకరు చూచుకొనిరి వాని యా మాటలాడుట వారికి విచిత్రముగ నున్నది వారు వానితో మాటాడలేదు మహానందుని తిలకించి, "వానికి కావలయు మోక్షమును నీవు ప్రసాదించరాదా! మరి వాడు వేదాంతివలెగూడ నున్నాడు అందరి యాత్మలు నొక్కటే యయినప్పుడు ఆశ్రమములు,ధర్మములు నెందుకు? వీని ఈ వాచావిడంబనమునను, ఈ దానపరిగ్రహణమునను క్రొత్తధర్మము కాశికలో నెలకొనిన వెలకొనగాక! మేము కడజాతి ద్రవ్యమును ముట్టము" అనిరి

మహానందుడు వారిని చూచి యిట్లనెను: "మీరు ముట్టరు నా డేమగును వాడు పుణ్యమును సంపాదించుకొనగా నిచ్చటికి వచ్చెను బ్రాహ్మణులము మనమేమి చేయవలయును దానమిత్తునన్నచో తిరస్క

—54వ పేజీ చూడండి

మా శ్రేయోభిలాషులందరికి హృదయపూర్వక అభినందనలు

# అందరికి మా ఉగాది శుభాకాంక్షలు.

## "ఆల్విటోన్‌నే

### శిఫారసు చేస్తున్నది ఎందుచేతనంటే...

అది సుఖనిద్రనూ అధిక శక్తినీ కలిగిస్తుంది.
దినమంతా శ్రమించిన ఆయాసం పరిహరించి హాయినిస్తుంది"

- తేలికగల ఏకసమ కణాలు
- అడుగున గసి నిలవక శీఘ్రంగా కరుగుతుంది
- ఎప్పటికంటె అధిక ప్రమాణం కలదు
- ఎప్పటికంటె బాగుపరచబడ్డ శ్రేష్ఠత కలద.



# ఆల్విటోన్

భారతదేశపు ప్రియకర ఆహార పానీయం

అత్యంత ఆరోగ్య పద్ధతిని
అత్యాధునిక యంత్రపరికరాలతో తయారైనది.




తయారికః
ఆల్విటోన్ ల్యాబొరేటరీస్, మదరాసు-32

EP/AL/T 1

# జీవితం నేర్పిన పాఠాలు

## డా॥ ఆర్. సి. మజుందార్

పూర్వ బెంగాలులోని ఒక కుగ్రామంలో నేను జన్మించాను మాది పేదసంసారం ఆ సమీపంలో పట్టణమనేది లేదు సరికదా, ఇతరత్రా ప్రముఖమైన ఊరుకూడా లేదు గొప్ప సదుపాయాలేవీ నాకోసం సిద్ధంగా లేవు ఏవో తగుమాత్రమైన సుఖాలతో, నిరాడంబరమైన గ్రామీణజీవితం వినా నేను ఆశించ తగిందికూడా కనిపించలేదు నా చిన్నతనంలో భగవంతుడు నాకొక వరం ఇచ్చిఉంటే, నా జీవితం ఇంకొక విధంగా ఉండేది ఇప్పటి నా జీవితానికి, దానికి ఎక్కడా పొంతన ఉండేదికాదు అసలు ఈనాటి నా జీవితానికి దోహదకారకములైన వేవీ స్వప్నంలోనైనా నేను ఆనాడు కోరిఉండేవాణ్ణి కానేమో

నా డబ్బై రెండేళ్ల జీవితాన్ని ఒక్కసారి వెనుకకు తిరిగి చూచుకుంటే అంచనాలకు, వాస్తవిక సంఘటనలకు మధ్య ఉన్న అగాధం నాకు దిగ్భ్రమకలిగిస్తుంది జీవిత సమస్యను, రహస్యాన్ని—పరిష్కరించడానికి ఒక నిరర్థకమైన ప్రయత్నంగా, నాలో ఆలోచనాపరంపర ప్రారంభమవుతుంది నేను ఇంత వృద్ధిలోకి (ఈమాటను అంతా వాడే అర్థంలోనే వాడుతున్నాను) వచ్చానంటే కారణమేమని చెప్పగలను? నా ప్రతిభా, సామర్థ్యాలకు తోడు, కష్టపడి కృషిచేసినందువల్లనే ఇది సాధ్యమైనదనుకోటం నా అహంభావాన్నిమాత్రమే సూచిస్తుంది ఎందుచేతనంటే, నాతో సమానమైన ప్రతిభావంతులు, అంతకంటే అధికులు యధాశక్తి కృషిచేసినా, నాతో సమానంగా వృద్ధిలోకి రాలేకపోయారు పాఠశాలలోనూ, కళాశాలలోనూ నా సహాధ్యాయులలో నాకంటె మిక్కిలి తెలివిగలవారు ప్రతిభావంతులు సుమారు ఒక డజనుమంది ఈనాటికి కూడా నాకు జ్ఞాపకం ఉన్నారు. వీరంతా జీవితంలో ఏమీ సాధించలేకపోయారు

నాకు సంబంధించినంతవరకూ, చేతికి అంది వచ్చేట్టు కనిపించిన అవకాశాలనేకం ఇట్టే నన్ను మోసగించాయి సహేతుకమైన అంచనాలు దెబ్బతిన్నాయి ఒకసారి, రెండుసార్లూ కాక, ఎన్నో తడవలు హఠాత్పరిణామాలు సంభవించాయి

నేను ఆశించడానికి కూడా సాహసించలేని సంఘటనలు తటస్థించాయి; తెలియని నెలవులనుంచి అడగని ఉపకారాలు వర్షించాయి జీవితమంటే విరక్తి కలిగించిన అపజయాలు, శ్రేయోదాయకమైన పరిణామాలకు దారితీశాయి. నన్ను ఆకర్షించిన దుష్టమార్గాల నుంచి విచిత్రంగా తప్పుకున్నాను; హఠాత్సంఘటనలు నన్ను ఋజుమార్గంలో ప్రవేశపెట్టాయి నా బుద్ధిని వ్యతిరేకించి, బలవంతంగా చేయవలసివచ్చి, చేసిన పనులు కొన్ని—నాకు అయిష్టమైనవీ, రుచించనివీ—నా శ్రేయస్సుకు దోహదం కలిగించాయి

చరిత్రను నా అభిమానవిషయంగా ఎంచుకొనడమే ఇందుకు ప్రముఖమైన ఉదాహరణ ఇంటర్మీడియేట్ పరీక్షకు నేనీ విషయం తీసుకొనలేదు. అప్పట్లో నాకు విజ్ఞానశాస్త్రవిషయాలమీద మోజు ఉండేది బి ఎ పరీక్షకు చరిత్ర తీసుకోవలసి వచ్చింది అదే నాజీవితంలో ముఖ్యమైన మలుపు అని ఈనాడు అనుకుంటున్నాను

ఇలాంటి సంఘటనే మరొకటి సంభవించింది డిప్యూటీ మేజిస్ట్రేట్ ఉద్యోగానికి ఖాళీ ఒకటి వచ్చింది విశ్వవిద్యాలయాధికారులు సిఫార్సుచేసిన వారిలో నేను ప్రథముణ్ణి డార్జిలింగ్‌లో ఇంటర్వ్యూ జరుగవలసి ఉన్నది కాని హఠాత్తుగా జబ్బుచేసి, నేను అక్కడికి వెళ్లలేకపోయాను అంత మంచి ఉద్యోగం అందుబాటులోకి వచ్చినట్టే వచ్చి, చెయ్యి జారిపోయింది మా కుటుంబం విచారసాగరంలో మునిగిపోయింది. నా భావి జీవితానికి పెద్ద ఆఘాతం తగిలిందనుకున్నారు కాని, ఆ తరువాత భగవంతుని కృపవల్లనే నాకు ఆజబ్బు వచ్చిందని భావించాను పైకి అపజయాలుగా కనిపించినవి తరచు విజయానికి సోపానములవంటివని ఈ ఉదంతం నాకొక గొప్ప పాఠం నేర్పింది

నా జీవితంలో సంభవించిన ఈ వింత సంఘటనలనుగూర్చి, హఠాత్పరిణామాలనుగూర్చి చాలా తడవలు ఆలోచించాను ఆలోచించినకొద్దీ, నా భవితవ్యాన్ని నిర్ణయిస్తున్నవి నా బుద్ధి, విచక్షణ కావనీ, ఏవో అజ్ఞాత శక్తులు దానికి రూపురేఖలు దిద్దుతున్నవనీ నమ్మక తప్పడంలేదు "ఎంత అవసవ్యంగా మన జీవితలక్ష్యాలను నిర్ణయించుకున్నా, భగవంతుడే వాటిని తీర్చిదిద్దుతాడు" అన్న మహాకవి వాక్యాలలో ఉదాత్తమైన తాత్త్వికచింతన కనుపించక పోయినా, చాలా యదార్థం ఇమిడిఉన్నదని జీవితం నాకు బోధపరిచింది

సాటిమానవులతో సంబంధం పెట్టుకున్నప్పుడే జీవితంలో చాలా పాఠాలు నేర్చుకోవచ్చు ఇతరులతో వ్యవహరించడం అనే సమస్య జీవితంలో ప్రతి దశలోనూ ఎదురవుతుంది మనతో, ఇతరులు ఎలా ప్రవర్తించాలని ఆశిస్తామో, వారితో మనంకూడా అలగే ప్రవర్తించాలి" అన్న సామెత రకరకాల అనుభవాలు గడించినతరువాత నాకు బోధపడింది ఇది ఉత్తమధర్మంగా నాకు తోచింది దాన్ని అనుసరించడానికి నేను ప్రయత్నించాను. ఎప్పుడైనా ఒక విచిత్రసంఘటన ఎదురైతే, "ఈ స్థితిలో ఇతరులు నాయందు ఎలా ప్రవర్తించాలని నేను ఆశిస్తాను?" అని నన్ను నేను ప్రశ్నించుకునేవాణ్ణి. ఈ ప్రశ్నకు నా అంతరాత్మ ఇచ్చిన సమాధానాన్ని బట్టి, నా వైఖరిని, కర్తవ్యాన్ని నిర్ణయించుకునేందుకు యత్నించేవాణ్ణి.

కాని చాలామంది ఈ ధర్మాన్ని అనుసరించి నాతో వ్యవహరించటంలేదని తరచు అనిపిస్తూ ఉండేది నా చిన్నతనంలో తోటివారి ప్రవర్తనవల్ల నాకు దుర్భరమైన విచారంకలిగేది. కొందరిలో కృతఘ్నత, ఓర్వలేనితనం, మోసం, ఎంత ఎక్కువగా ఉండేవంటే, రానురాను మానవులందరిమీదా నాకు గౌరవభావం సన్నగిలింది మానవజాతి అంటేనే దాదాపు ద్వేషభావం ఏర్పడింది కాని వయస్సు ముదిరినకొద్దీ, నా భావాలలో మార్పు వచ్చింది ఇతరులపై ఒక అభిప్రాయాన్ని ఏర్పరుచుకునేటప్పుడు తరచు వారి మనస్సులలోకి చొచ్చుకుని వెళ్లలేమనీ, అందువల్ల వారి దోషాల తీవ్రతను తగ్గించే పరిస్థితులను సవ్యంగా అంచనా వేయలేమనీ నేను తెలుసుకోగలిగాను

ఒక వ్యక్తి నా వద్ద కొంత డబ్బు అప్పుగా తీసుకుని, తిరిగి ఇవ్వలేదు అతనియందు నాకు సదభిప్రాయం పోయింది కాని కొన్ని సంవత్సరాల తరువాత అతడు ఎలాంటి పరిస్థితులలో చిక్కుకున్నాడో తెలియవచ్చింది నా డబ్బు ఇవ్వలేకపోవడానికి చాలా కారణాలు కనిపించాయి



డా. మజుందార్

సాధారణంగా మానవులు తాము పొందిన ఉపకారాలు వెంటనే మర్చిపోతారు కాని మళ్ళీ తాము ఏవో ఉపకారాలు ఆశించి, అవి జరుగకపోతేమాత్రం చాలా కాలం జ్ఞాపకం ఉంచుకుంటారు

ఒకరికి నేను డబ్బు సహాయంచేసి పబ్బం గడిపాను. మరో రెండు తడవలు కూడా అలాంటి సహాయమే చేశాను కాని అతడు నాలుగవతడవకూడా నా సహాయం అర్థిస్తే నేను నిరాకరించాను అతడికి చాలా కోపం వచ్చింది నాకూ, తనకూ స్నేహితులైన వారివద్దకు వెళ్ళి నావల్ల పొందిన సహాయం చెప్పకుండా, నేను నిరాకరించిన సహాయం మాత్రమే చెప్పాడు ఈసంగతి తెలిసిన మొదట్లో నాకు ఆగ్రహం కలిగింది కాని, ఆతరువాత వేరొకకోణం నుంచి ఈ విషయాన్నంతటినీ పరిశీలించ నారంభించాను లేనివారికి కలవారంటే లోలోన ద్వేషం ఉంటుంది వారి సహాయంపొందే హక్కు తమకు ఉన్నదనీ, తమ అవసరాలు తీర్చటం వారి విధి అనీ వీరు భావించటంకూడా కద్దు తమకు సహాయం చేసినందువల్ల కలవారు చెడిపోయేది ఏమీ ఉండదనీ,

—57 వ పేజీ చూడండి

సుప్రసిద్ధ చరిత్రకారులు డా॥ ఆర్. సి. మజుందార్ వ్యాసం ప్రచురించగలిగినందుకు గర్విస్తున్నాము. ఈ వ్యాసాన్ని తెలుగులో అనువదించుకునేందుకు అనుమతించిన 'భవన్స్ జర్నల్' సంపాదకులకు కృతజ్ఞులము,

# చదువుల్రావు




పరీక్షలహాలులో ఒకనాడు—
ఏమిటోయ్ నీ జేబులోపల ఏదో ఎత్తుగా ఉంది?
ఏమీ లేదుసార్
ఏదో పుస్తకంలాగుందే?... బయటకి తియ్యి
జేబులోంచి బయటకు తీసిస్తాడు
ఏమిటోయ్ ఇది, కాపీకొట్టాలనే తీసుకువచ్చావా నిన్ను డీబార్ చేయించేస్తాను
అబ్బె ఇది పుస్తకం కాదండీ.
నాకు కళ్ళు లేవనుకున్నావుటోయ్? అయినా ఇది ఏం పుస్తకమో చూడనీ.
అబ్బబ్బే అది తెరవకండి
కాని ఆయన ఆ పుస్తకంలాగుండే పెట్టె మూత (అట్ట) తెరవగానే—
ఏప్రిల్ ఫూల్
సత్యమూర్తి

# మనమూ - మన దేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## ప్రొటీనులు - 3

గతవారం ప్రాణశక్తికి సంబంధించిన ప్రాచీన ఆధునిక సిద్ధాంతములను గురించి తెలుసుకొన్నాము. సూర్యరశ్మి ప్రభావంచేత, గ్రహ శరీరములను చుట్టివుండే వాయువులు ఘనీభవించి, మొదటి ప్రోటీను కణములు తయారయివుంటవనీ, విద్యుచ్ఛక్తిలాగే, ప్రాణశక్తి కొన్ని రసాయనిక వికృతుల ఫలితమై వుంటుందనీ ఆధునిక శాస్త్రజ్ఞులభావన.

ఎలక్ట్రాన్ మైక్రోస్కోప్‌వల్ల ప్రోటీను కణంలో అణునిర్మితి ఎల్లా వుంటుందో తెలుసుకున్నారు. అల్లాగే ఎలెక్ట్రాన్ టెలిస్కోప్‌వల్ల ఖగోళంలో నక్షత్రములుకూడా, చుట్టు మెట్లులాగే సవ్యక్రమంలో పైకి పోతున్నవని తెలుసుకున్నారు. అయితే అవి అల్లా వెళ్లి వెళ్లి ఎక్కడ అంతమవుతవో తెలుసుకోలేదు. కాని మనిషి చంద్రమండలంమీదకు పోగలిగితే, అక్కడ ఆ టెలిస్కోపువుంచి చూస్తే, మరి కొన్ని విశేషములు తెలుసుకోవచ్చును. ప్రోటీనుకణంలోగాని, ప్రాణశక్తి ప్రసరించలేదనీ, ప్రోటీనుకణంలోనూ ఖగోళంలోనూ నిర్మాణవిధానం ఒకేలాగా వుంటుందనీ తెలుసుకోడం విశేషం. ఋషులదృష్టిలో 'చైతన్యత'లేని వస్తువేలేదు. దాని ప్రభావం మన ఇంద్రియాలకు తెలిసినప్పుడు, అది "ప్రాణశక్తి" అనిపించుకుంటున్నది. ఈనాడు టెలిస్కోపువంటి అనేక సాధనములచేత, మన ఇంద్రియముల శక్తిని హెచ్చుచేసుకుంటున్నాము. ఆసాధనముల శక్తి హెచ్చినకొద్దీ, ఎన్నో రహస్యములు శాస్త్రజ్ఞులు తెలుసుకొంటారు. ఈ శక్తినే ఋషులు యోగ సాధనతో హెచ్చించుకున్నారు. యోగసాధనలో భూమిమీదనుంచి పైకి లేచేవారు అనేకు లున్నారు. అంటే, వారి శరీరంమీద భూమి ఆకర్షణశక్తి పని చేయదన్న మాట. 'అణిమ', 'గరిమ', 'లఘిమ' వంటి అష్టసిద్ధులు యోగసాధనవల్ల కలుగుతవని పతంజలి చెప్పేడు. ప్రయోగనిర్ధారితములయిన సత్యములు మాత్రమే విజ్ఞానపరిధిలోకి వస్తవి. ఎవరయినా యోగసాధన చేసినవారు, విజ్ఞానవేత్తల సమక్షంలో ఈ శక్తులు ప్రదర్శించిననాడు, అది పుక్కిటిపురాణములూ, మూఢ విశ్వాసములూ కాక, సత్యమయిన సంఘటనలు అవుతవి; అవి ఎల్లా సాధ్యమయినవీ అనే విచారణ ప్రారంభం అవుతుంది. జీవితానికి హృదయస్పందనం అవసరమనీ, అది కొన్ని క్షణములకంటె ఆగడానికి వీలులేదనీ, శరీర ధర్మశాస్త్రం చెప్తున్నది. కాని, అమెరికాలో, నిపుణుల మధ్యంలో $4\frac{1}{2}$ నిముషములకాలం హృదయ స్పందనం నిలిపి, హృదయం ఆగినా, జీవితం సాగుతూనే వుంటుందని ఒక యోగి ఋజువుచేశాడు. అల్లాగే ప్రాణాయామంచేసి ఊపిరి పీల్చడం నిలిపి వేసి కూడా, తిరుగుతూ [illegible]డేవారు చాలా మంది ఉన్నారు. ఇంతవరకూ [illegible]చేత శరీరశాస్త్రజ్ఞుల అభిప్రాయాలు [illegible]లేదు. ఇంతవరకు జరిగిన శాస్త్ర[illegible] [illegible] ములవల్ల జరిగినవి. (Analysis) [illegible] శాస్త్రజ్ఞులకు తెలి[illegible] (Protoplasm) పరీక్షించడానికి [illegible] ణంలో జీవశక్తి అంతరించి, దాని శవాన్నిమాత్రమే పరీక్షించడం జరుగుతున్నది. అందుచేతనే జీవశక్తి స్వరూపమును శాస్త్రజ్ఞులు నిర్ణయించలేకపోతున్నారు. అటువంటిదే అంతరిక్ష పరిశోధన. ఈ శరీరంతో ఊర్ధ్వగాములై, కొంతవరకే మానవులు పోగలరు. ఆ తర్వాత అక్కడవుండే వాతావరణస్థితికి అనుగుణంగా శరీరకవచాలనూ, ప్రాణవాయువునూ ఆహారపదార్థములనూ, తీసుకునిపోవాలి. తీసుకుని పోయినా, అవి ఎక్కువ రోజులు వుండవు. ఈలోగానే చేయవలసిన పరిశోధనలు చేయాలి. లేకపోతే పాదలేపన సహాయంతో హిమవత్పర్వతాగ్రానికిపోయి, అది కరిగి పోగానే, మళ్లీ తిరిగి రాలేని ప్రవరాఖ్యుడిస్థితి యేర్పడుతుంది. భూమినుంచి పైకి ఏడు ఆవరణలున్నవనీ, ఆకాశంవరకే మానవుడు మానవదేహంతో పోగలడనీ, ఆపైకి పోవడానికి కొన్ని శక్తులూ, సిద్ధులూ కావలెననీ యోగాభ్యాసంవల్ల యోగులకు ఆసిద్ధులు లభిస్తవనీ, మన గ్రంథాలు చెబుతున్నవి. ఆధునికులమయిన మనము వాటిని పరిహసిస్తాము. కాని, "హృదయస్పందనం నిలిపి జీవించలేవు" అనే శాస్త్రజ్ఞుణ్ణిహృదయ స్పందనం ఆపి జీవించిన యోగ సాధకుడూ పరిహసిస్తాడు. సృష్టిక్రమంలో జరుగుతున్నది. ఏకప్రోటీనుకణశరీరి అయిన వైరస్ నుంచి మానవుడిదాకా, సృష్టి పరిణమిస్తూ వచ్చింది. మానవుడినుంచి అధిమానవుడు పరిణమించక తప్పదు. అయితే యేవిధంగా ఆ పరిణామం జరుగబోతున్నది? అన్నది వివాదాంశము. ఎలెగ్జి కేరల్ వంటి శాస్త్రజ్ఞుల వైఖరి అవలంబించుకుని, సత్యాన్వేషణకు పూనుకుంటే, మానవుడి శరీరభాగములనూ, వాటి స్థానాల ధర్మములనూ అర్థంచేసుకున్నట్లే ఆ శరీరాంతర్గతమైన ప్రాణశక్తి స్వరూప స్వభావములనూ, ఆ ప్రాణశక్తికి మూలకారణమైన ఆదిశక్తి స్వరూప స్వభావములనూ అర్థం చేసుకుంటాము. కొన్ని గంటలలో చేయగల ప్రయోగాలు కొన్ని. జన్మాంతం చేస్తేగాని, సత్యం గోచరించనివి కొన్ని. "టీకాలు వేసుకుంటే మశూచికం రాదు. వచ్చినా ప్రాణాపాయం కలిగించదు" అన్న సత్యం నిరూపించడానికి ఎంతకాలం పట్టింది?" "బి. సి. జి. టీకాలతో, క్షయనిరోధకశక్తి ఏర్పడుతుంది" అని ప్రయోగరీత్యా నిర్ణయించడానికి ఎంతకాలం పట్టింది? అల్లాగే "యోగాభ్యాసంవల్ల కొన్ని శక్తులు కలుగుతవి, కలగవు." అని నిర్ణయించడానికి ఒక జన్మకాలం పడుతుంది. ఒకప్పుడు జన్మాంతరముల కాలం పడుతుంది. ఆవిధానములను అనుసరించడానికి అనుకూలమయిన వాతావరణం ఆధునికకాలంలో నశించింది. అతి కష్టసాధ్యమయినందున ఆ విధానం అందరూ అవలంబించలేరు. దానిని అవలంబించి సాధించినవారు, కొన్ని శక్తులు లభించగానే వాటిని ఐహికసుఖాలకు వినియోగించి, జగద్వంచనచేసి, చివరకు ఆత్మనాశనము పొందుతారు. ఈ నాటి విజ్ఞానమూ అంతే. ఎంతమంది విజ్ఞానవిద్యార్థులు అణువిచ్ఛేదంచేసి ఏటంబాంబులు చేయగలరు? ఎంతమంది అంతరిక్షంలో విహరించి రాగలరు? అందుకు కావలసిన సాహసం, ధనం, ఆరోగ్యం ఎందరు సంపాదించగలరు? ఆసాహసం, ఆ అభిరుచి వున్నవారికి యోగ విద్యా దుర్లభంకాదు. యోగవిద్య దైవికమయిన రహస్యమూ? ప్రయత్నసాధ్యమా? అటువంటిదేదయినా వున్నదా? లేక అదీ ఒక మూఢవిశ్వాసమా? తన కళ్లతో చూచినదానినీ, తన చెవులతో విన్నదానినీ, తను విశ్వసించేవారు నమ్మి దానినీ మానవులు నమ్ముతారు. విశ్వాసం అన్నది విశ్వానికే శ్వాసం. ఇరవై సంవత్సరాలకుముందు ఎక్కడో ఎవరికోగాని కనుపించని సిద్ధులెందరో ఈ నాడు నగరాల్లో నాగరికుల్లో తిరుగుతూ, తమ అద్భుత చర్యలతో శాస్త్రజ్ఞులను విభ్రమిస్తున్నారు. ఇదే సమయంలో విజ్ఞానులూ, ప్రాణశక్తి స్వరూప స్వభావాలు తెలుసుకుని తీరాలి అని ధృఢసంకల్పులయినారు. ప్రకృతిలో సర్వమూ, అణుమయమన్న విజ్ఞాని ఈ నాడు అణు విచ్ఛేదానంతరం ప్రకృతి మూలస్వరూపం యేమిటని గవేషణ సాగిస్తున్నాడు. యోగులూ, అణు విచ్ఛేదానంతరమే పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకున్నారు. అయితే విజ్ఞానులు ఆ తమ విజ్ఞానాన్ని మానవ నాశనానికి వినియోగిస్తుంటే జ్ఞానులు ముక్తికీ, మానవసేవకూ దానిని వినియోగించారు. ఏమయినా అణువిచ్ఛేదం సాధారణజీవితానికీ, అధిమానవ జీవితానికీ మధ్య వంతెనవంటిది. యోగం అంటే యేదో కాదు. ఏకాగ్రత యోగలక్ష్యం. ఏకాగ్రత కుదరడానికే, అందులోవున్న నియమములన్నీ. ఏకాగ్రత లేకుండా విజ్ఞానులుకూడా దేనినీ సాధించలేరు. అణువిచ్ఛేదానంతరం శాస్త్రజ్ఞులు తెలుసుకుంటున్న ప్రతి విషయమూ ఒకప్పుడు యోగులు తెలుసుకున్న విషయములు సత్యములని నిరూపిస్తున్నది. అయితే విజ్ఞానం సంపాదించడానికి వున్నన్ని అవకాశాలు యోగవిద్య సంపాదించడానికి ఈనాడు లేవు; రేపు రావచ్చును.

శరీరం కోటానుకోట్ల జీవకణముల కలయికతో ఏర్పడ్డది. యావచ్ఛరీరంలోనూ ఏ ముఖ్య కార్యకలాపం జరుగుతున్నదో శరీరాంతర్గతములయిన జీవాణువులలోనూ అదే కార్యకలాపం జరుగుతున్నది. శరీరంలో, ఉన్న ధాతువులు నశించి, శక్తి పుట్టడం, ఆహారంతో నూతనధాతువులు ఉత్పత్తికావడం జరిగినట్లే ప్రతి జీవాణువులోనూ లయనిర్మాణములు జరుగుతూ వుంటవి. ఏకాణుజీవి అయిన వైరస్ శరీరంఅంతా ఒకే ఒక్క ప్రోటీనుకణం మాత్రమే. అయినా అది ఆహారం తీసుకుంటుంది. దాన్ని జీర్ణించుకుంటుంది. లింగభేదంలేని ఇతర ప్రాణులుచేసేపనులన్నీచేస్తుంది. శరీరంలోజీవకణంలో ప్రధానమయిన భాగాలనూ, అవి చేసే పనులనూ తెలుసుకుంటే, అందులో జరిగే కార్యక్రమంలో ప్రోటీనుకణములూ, తరవాత కోలెస్టరాల్ పాస్ఫొలైపిడ్‌వంటి వస్తువులూ ప్రధానపాత్ర నిర్వహిస్తవి అని తెలుస్తుంది. విచక్షణాశక్తి జీవశక్తికి ప్రధాన లక్షణం. జీవకణమునకు విచక్షణాశక్తి ఇచ్చేభాగములన్నీ పై వస్తువులతో ఏర్పడేవే. ఆవిషయం అర్థం చేసుకోవాలంటే జీవకణమునుగురించీ, దాని అంతర్భాగములనుగురించీ వివరంగా తెలుసుకోవాలి. (సశేషం)

## మొదటిబహుమతి వ్యాసం

# నేటి మన సినిమాలు

### 'ఏ మ్మార్'

[పోటీకివచ్చిన వ్యాసాలు చాలావరకూ అసంతృప్తికరంగానే ఉన్నాయి. బహుమతులు నిర్ణయించటం కష్టమనిపించలేదు: బహుమతి వ్యాసాలు మూడూ నేటి మన సినిమాలు సంతృప్తికరంగాలేవని సూచిస్తున్నాయి. కాని ఈ అసంతృప్తి ప్రజలకు చలనచిత్రాలపైన నిజమైన అభిమానం ఉన్నట్లు తెలుపుతోంది— అని మా అభిప్రాయం:]

ఎవరెన్నిచెప్పినా, నేటి మన సినిమాలస్థాయి అంతగా అభివృద్ధిచెందటంలేదు. అందులోనూ, తెలుగు సినిమాలస్థితి మరీ శోచనీయం. ఆధునిక ప్రచార సాధనాల్లో సినిమా చాలా శక్తివంతమైంది. చదువు సంధ్యలతో నిమిత్తం లేకుండా స్త్రీ, పురుష వివక్షణతో పనిలేకుండా సర్వులనూ ఆకర్షించగల సామర్థ్యం సినిమాకుమాత్రమే వుంది.

గ్రంథస్థమై వున్న విషయాలు విద్యావంతులకూ, రేడియో, వార్తా పత్రికలు మొదలైన వాటిద్వారా వెలువడుతున్న విషయాలు కొందరు ధనవంతులకూ, వీలు కాగా సామాన్యులకు సైతం అందుబాటులోగల సాధనం సినిమా. ఆర్థికంగా వెనుకబడివుండి, నిత్య జీవితంలో తృప్తికి, సుఖశాంతులకు నోచుకోని ప్రజలు, తాత్కాలికంగానైనా తమను అనుక్షణం యెదుర్కొనే సమస్యలకు దూరంగాపోయి, యేదో ఊహాలోకంలో విహరించేందుకు ఉవ్విళ్లూరటం సహజం. మనదేశానికి సంబంధించి, ఈ కారణం కూడ ముఖ్యమైంది. నేడు సినిమాలకు లభిస్తున్న ఆదరణలో యెక్కువభాగం, సమాజంలోని యీ వర్గంవారినుంచేనన్న విషయం పరిశీలించి చూచినప్పుడు తేటతెల్లమౌతుంది. కడుపునిండా తిండి లేని, నిర్భాగ్యులకు సినిమా అందరాని ఫలం. అగర్భ శ్రీమంతులకు అంతులేని విలాసాల్లో సినిమా ఒకటి మాత్రమే. ఇకపోతే భుక్తికి లోటులేని మధ్య తరగతివారికి, కలిమిలేముల సరిహద్దులో జీవించే అనేక మందికి సినిమానుమించిన వినోదసాధనం లేదు. ఉన్నా అది సాధ్యంగాదు.

ఈనాడు సరదాగా కాలక్షేపం చెయ్యటమంటే, సినిమాకు పర్యాయపదంగా చెప్పుకోవచ్చు. నాటకం, సంగీతం, నాట్యం, చిత్రకళ మొదలైన మిగతా వినోద సాధనాలు మనకు ప్రస్తుతం అందుబాటులో లేవు. ఈ పరిస్థితి మారేవరకు సినిమాకు నేడు లభిస్తున్న ప్రోత్సాహం ఇనుమడిస్తుందేగాని, తగ్గే అవకాశం లేదు.

పైన వివరించిన కారణాలచేత ప్రస్తుతం సామాన్యుని నిత్యజీవితంలో సినిమా భాగంగా పరిణమించింది. తత్ఫలితంగా ప్రేక్షకుల భావనారీతులపై అది చూపే ప్రభావం అనల్పమైందికాదు. ఈ కారణంచేత, ఇంతటి శక్తివంతమైన సాధనాన్ని, యెంతో మెలకువగ, ప్రయోజనాత్మకమైన రీతిలో ఉపయోగించుకోవలసిన అవసరం వుంది. అలా కాని నాడు, ప్రజల అభిరుచులు పెడత్రోవ తొక్కటమే కాక, యీ సాధనంద్వారా సమకూడగల ప్రయోజనాలు సమ్మకానటం జరుగుతుంది.

అదృష్టవశాత్తు, నే డీ పరిశ్రమ ప్రభుత్వ జోక్యం లేకుండా, కేవలం వ్యక్తుల ఆధిపత్యంలోనే వుంది. కళాపోషణకుగాని, సంస్కరణాభిలాషతో గాని, కేవలం వ్యాపారరీత్యాగాని వీరు నిర్మించే చిత్రాలు ప్రజావసరాలకు సరిపడేటట్లు వుండాలి. వాటి బాగోగులు, బాధ్యత పూర్తిగా వీరిదే.

మనకు గతంలో కొన్ని మంచి చిత్రాలు వచ్చిన మాట నిజం. ప్రచారసాధనంగా, సినిమాకుగల



రచయిత

ప్రయోజనాన్ని గుర్తించిన ఆనాటి నిర్మాతలు తమ శక్తివంచనలేకుండా వినోదంతోపాటు, సాంఘిక చైతన్యం కలిగించేందుకుకూడ ప్రయత్నించారు. పరిశ్రమలో అనుభవంగాని, ప్రజల సానుభూతి గాని లేని ఆరోజుల్లో కేవలం స్వయంకృషిపై ఆధారపడి వారు చేసిన శ్రమ యెంతో ప్రశంసించదగింది. నిర్మాణంలోగాని, ప్రదర్శనకుగాని నేడున్న సదుపాయాలు, ప్రభుత్వసహాయం, అనుకూలమైన సాంఘిక వాతావరణం నాడు లేవు. అయినప్పటికీ ఒక నిర్దుష్టమైన లక్ష్యంతో, ఒక ప్రయోజనాన్ని సాధించాలనే దీక్షతో అనేకమైన వ్యయ ప్రయాసలకులోనై, ఆనాడు చిత్రాలు నిర్మించటం జరిగింది. నేడు తెలుగులో ఉత్తమచిత్రా లనదగిన వాటిలో కొన్ని లేకపోలేదు.

కాని, రాను రాను పరిస్థితి మార్పుచెందింది. ప్రేక్షకులకు యెలాంటి చైతన్యాన్ని కలిగించక, కేవలం కాలక్షేపానికి సాధనాలైనవి. ఆనాటి వ్యక్తులు, సంస్థలు క్రమంగా మరుగునపడి, అనేక మంది నూతనంగా ఇందులో ప్రవేశించి, చాల మంది వెంటనే విశ్రమించటం జరుగుచున్నది. సినిమా వ్యాపారం ఒక జూదంగా పరిగణించి, అందులో కృతకృత్యులుకాలేక, వారి దృష్టిలో అదృష్టం కలిసిరాక, అనేకులు పరాజితులైన సందర్భాలు లేక పోలేదు. ఇలాంటి సాహసిక చర్యలవల్ల, వ్యక్తులు నష్టపోవటం అలావుంచి, పరిశ్రమకు చాల అపచారం జరుగుతుంది.

కొన్ని సంవత్సరాలుగా తెలుగు సినిమాల చరిత్ర పరిశీలించిచూస్తే, చలనచిత్రాలద్వారా ఉన్నత ప్రమాణాలు సాధించేందుకు, చిత్తశుద్ధితో చేసిన కృషి చాల స్వల్పం అని తెలుస్తుంది. ఒక రిద్దరు సాహసించి, అందుకు పూనుకొని, ఆర్థికంగా, ప్రోత్సాహం లేక విఫలులు కావటం జరిగింది. దానితో నిర్మాతలలో కొన్ని నిశ్చితాభిప్రాయాలు యేర్పడినయ్. సినిమాల ద్వారా యేదో సాధించాలని పూనుకొని, హతాశులు కావటం అవివేకమని, పెట్టుబడికి నష్టం లేనివిధంగా, వినోదప్రధానంగా చిత్రాలు నిర్మించటం ఉభయతారకంగా అనేకులు భావించారు. తత్ఫలితమే నేడు మనకు అధికంగావస్తున్న, యెలాంటి అనుభూతినికలిగించలేని పేలవంగా వుంటున్నచిత్రాలు.

కాని పరిశీలించి చూచినప్పుడు యీ వాదనలో పసలేదనిపిస్తుంది. ప్రతి చిత్రమూ బాగోగులతో నిమిత్తములేకుండా కొద్దో గొప్పో డబ్బుచేసుకోవటం మనం చూస్తున్నాం. కాకపోతే ప్రజల్ని విశేషంగా ఆకర్షించిన చిత్రం యెక్కువకాలం ప్రదర్శించబడి 'శతదినోత్సవం'లాంటిది చేసుకోవటం జరుగుతున్నది. అయితే యిలాంటి ఉత్సవాలు గురించికూడ యిటీవల కొన్ని అపశ్రుతులు వినిపిస్తున్నయ్. అది వేరే విషయమనుకోండి. కనుక యీ వ్యాసంలో ముందు వివరించిన కారణాలవల్ల, సామాన్యుని వినోదకాలక్షేపానికి, సినిమాను మించిన సాధనం లేనంతకాలం ప్రతిచిత్రానికీ కొంత ఆదరణ తప్పక లభిస్తుంది. ఇష్టంలేనప్పటికీ కొన్ని సందర్భాలలో సినిమా చూడవలసిరావటం, చూచిన చిత్రాన్నే తిరిగి కేవలం పొద్దుపుచ్చేందుకు చూస్తూండటం, మొదలైనవి అనుభవ పూర్వకంగా మనకు తెలిసినవిషయాలే. అయితే యిలా లభిస్తున్న ఆదరణను ఆసరాగా, ప్రేక్షకులు కోరే చిత్రాలు యిలాంటివేననికాని, సినిమాలద్వారా యింతకుమించిన ప్రయోజనాన్ని ఆశించలేమని గాని, భావించటం సరికాదు. పైగా ప్రేక్షకుల అభిరుచులు తెలిసికొని వారికి కావలసిన చిత్రాలేవో నిర్ణయించేందుకు సమగ్రమైన పరిశీలన యెవరూ చెయ్యలేదు. అందుచేత యిప్పటివరకూ జరుగుతున్న తతంగమంతా, కేవలం 'గాలివాటు'నుబట్టి సాగిపోతున్నదంటే అతిశయోక్తికాదు.

నీచాభిరుచులతోకూడిన కొన్ని చవుకబారు చిత్రాలు విజయవంతంగా నడిచిన కారణాన, అదేమార్గంలో నిర్మాణం సాగించి, సొమ్ముచేసుకోవాలని ఉబలాటపడటం సహించరాని విషయం. ప్రజల్ని నీతిమార్గంలో పెట్టి వారికి ధర్మోపదేశాలు చేయటం సినిమా నిర్మాతపని కాకపోవచ్చు కాని వారిలోని, నీచాభిరుచుల్ని ఆసరాగాతీసుకుని, అతి జుగుప్సాకరమైన చిత్రాలు నిర్మిస్తూ, కళారాధన చేస్తున్నామంటూ తృప్తి చెందటం క్షంతవ్యంకాదు. డిటెక్టివ్ పుస్తకాలు ప్రజల్ని యెక్కువగా ఆకర్షించినంతమాత్రాన అంతకంటే మంచి సాహిత్యం లేదనిగాని, ప్రజలకు అక్కరలేదనిగాని అనగలమా? చైతన్యంతో కూడిన

—55 వ పేజీ చూడండి

# కొత్తసంవత్సరం నిర్ణయాలు

ఉగాదితో కొత్త సంవత్సరం ప్రారంభమవుతుంది. చెయ్య వలసినా చెయ్యనివీ, చెయ్యరాదను కున్నా చేసినవీ-చాలా ఉంటాయి. (కనీసం) పైసంవత్సరమైనా చెయ్య కూడనివి చెయ్యకుండా చెయ్యదగి నవి చేస్తూ ఉండాలని కొన్ని నిర్ణ యాలను తీసుకోవడం ఒక నిర్ణయం. ఈనిర్ణయంఅమలుపర్చటం తేలిక. కాని దాని వెంటచేసిన నిర్ణయాలే పెద్ద సమస్యలై కూరు కుంటాయి! ఇకపైన ఫలానావారి మీాద విసుక్కోవటం - భోజనం తగ్గించి బరువు తగ్గించుకోవడం- చేసిన చిల్లరఖర్చుకంతా పయాపైసా తప్పకుండా సూక్ష్మంగా పద్దులు రాసుకోవటం-చదువుకునే వారైతే: పాఠాలు సక్రమంగా వల్లెవేసు కోవటం-ఇంకా ఇలాంటి నిర్ణయాలు లెక్కలేనన్ని చేసుకోవచ్చు. కాని వాటిని ఆచరణలో పెట్టటం ఎంత కష్టం! అందుకనే నిర్ణయాలప్రకారం నడుచుకోలేనివారు ఇకపైన నిర్ణయా లను రాకూడదనే నిర్ణయం వెంటనే చేసుకోవడం మంచిది.

ఎస్. వరలక్ష్మి

---

## వంటలు

[వంటలేమైనా ప్రచురించమని కోరుతూ పాఠకులు వ్రాస్తున్నారు: ప్రతివారం ఒక వంట అయినా పరిచయం చెయ్యాలను కుంటున్నాము.]

### ఉగాది పచ్చడి

ఉగాది పండుగరోజున అభ్యం గన స్నానంచేసి, వేపపూవు పచ్చడి తినటం తెలుగుదేశంలో సంప్ర దాయం. పచ్చడి తినాలని తెలిసినా, అది ఎలా చేస్తారో తెలియనివారు ఉండవచ్చు!

#### కావలసిన వస్తువులు

| | |
|---|---|
| వేపపూవు | — గుప్పెడు |
| చింతపండు | — 2 పలాలు |
| బెల్లం | — 3 పలాలు |
| అరటిపళ్ళు | — 2 |
| మామిడికాయ | — 1 |
| ఉప్పు | — చిటికెడు |

వేపపూత చేటలోపోసి బాగా నలిపితే, పూతకు అంటిఉన్న తొడి మలు విడిపోతాయి. అప్పుడు చెరిగి ఆ తొడిమల్ని తీసివెయ్యాలి. చింత పండు తగుమాత్రమైన నీటిలో నాన వేసి, గుజ్జు తియ్యాలి. చితుకకొట్టిన బెల్లం, ఉప్పు అందులో కలిపి దగ్గరగా ఉంచుకోవాలి. మామిడి కాయ, అరటిపళ్లు సన్నటి ముక్కలుగా తరిగి, ఆ ముక్కల్ని, చెరిగి సిద్ధంగా ఉంచుకున్న వేప పూతనూ చింతపండు గుజ్జులో కలుపుకోవాలి.

### మైదా హల్వా

#### కావలసిన వస్తువులు

| | |
|---|---|
| చక్కెర | — ½ అళాకు |
| మైదాపిండి | — ½ అళాకు |
| కాషాయరంగు | — చిటికెడు |
| నీరు | — 1/8 అళాకు |
| నెయ్యి | — ½ అళాకు |
| ఏలకులు | — 5 |
| లవంగాలు | — 4 |
| జీడిపప్పులు | — కొన్ని |
| ఎండు ద్రాక్షపళ్లు | — కొన్ని |

వెడల్పాటి గిన్నెలో నీరుపోసి ఉంచుకోవాలి—మైదాపిండిని పల్చని వస్త్రంలో చిన్నమూటగా కట్టి ఆ నీటిలోవేసి ఇటూ, అటూ తిప్పాలి. కొద్దిసేపటికి మెత్తటిపిండి నీటిలో కలిసిపోయి, పిప్పి వస్త్రంలో మిగిలి పోతుంది. జీడిపప్పులు, లవంగాలు నేతిలో వేయించాలి. వేగిన లవం గాల్ని ఏలకులతో కలిపి నూరాలి. చక్కెరలో ½ అళాకు నీరుపోసి కుంపటిమీాదపెట్టి లేతపాకం వచ్చిం తరువాత మైదా పిండి కలిసిన ద్రవాన్ని అందులో కలుపుకోవాలి. శుభ్రమైన గరిటెతో ఆపకుండా కలపాలి. కలపటం ఆలస్యమైతే పిండి ఉండకడుతుంది. రంగుకూడా అప్పుడే వేసుకోవాలి. కొద్దిసేపు గరిటతో కలిపేసరికి, పాకం చిక్కబడుతూ ఉంటుంది. అప్పుడు కొద్దికొద్దిగా నెయ్యి వేస్తూ కలపాలి. హల్వా గిన్నెకు అంటుకోకుండా తయా రయ్యేవరకూ కుంపటిమీాదనే ఉంచాలి. వేయించి ఉంచుకున్న జీడిపప్పులు, ఎండుద్రాక్షపళ్ళు, ఏలకులూ, లవంగాలు కలిపి నూరిన చూర్ణం హల్వాలో కలపాలి. వెడ ల్పాటి పళ్లానికి నెయ్యిరాసి, దీన్ని అందులోకి దిమ్మరించుకోవాలి. హల్వా పళ్ళెంలో చదునుగా ఉంటే, చల్లారిన తరువాత ఏ ఆకారంలో కావాలనుకుంటే, ఆ ఆకారంలో ముక్కలుగా కోసుకోవచ్చు. ★

ఎస్. సుబ్బలక్ష్మి.

# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి
# రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!

ఎందుకంటే : ఒక్క సారి తోముకొంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును**

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమెన్నడూ తెలియచేయనంతటి శాస్త్ర పరిశోధనం ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేవదనమైన నురుగు పళ్ల మధ్య దగపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు ఉత్సాహపడతారు ఎందుకంటే చాలా రుచిగా ఉండే దాని పిప్పరమెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !




మీకు పౌడరు కావాలంటే,
ఈ లాభములన్నిటిని మీరు
కాల్గేట్ టూత్ పౌడరు ద్వారా
పొందగలరు. ఒక డబ్బా
నెలంతా వస్తుంది




**కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే**

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు
ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.3187 TEL.



(గత సంచికతరువాయి)

రాత్రిలోగా రామారావు గతచరిత్ర ఆనోటా ఆనోటా ఊరిలో ప్రతీవారికి తెలిసింది అతని చరిత్ర విన్నవారు 'హాకరా' అంటూ ముక్కున వేలు వేసుకున్నారు "అబ్బ—యిన్ని కొంపలు కూల్చి తన ఒక్క ప్రాణంమీదికి వచ్చేసరికి ఎంత ఆరాటం" అన్నారు కొందరు చెప్పిపాడువుగా పేర్లూ వద్దులూ పెట్టి, అతన్ని ఊరు ఊరంతా కథలుకథలుగా చెప్పుకో సారంభించారు ఈప్రకారంగా మరో రెండురోజు లయ్యేసరికల్లా రామారావు గత చరిత్ర కొత్త కొత్త రంగులు పూసుకుని, బహుముఖవ్యాప్తం అయిపోయింది అతని కథ చెప్పేసరికల్లా ఏడుస్తున్న పసిపిల్లలుకూడా, కుక్కినపేనులా పడి వుండే అంత భయంకరంగా తయారుచేశారు.

నాలుగురోజుల్లో ఒంగిన ఈ మార్పుకు రామారావు తల్లడిల్లిపోయాడు ధర్మారావుని ఏం చేద్దామన్నా సమయం మించిపోయిందని విచారించాడు జరగబోయేదాన్ని ఊహించుకుంటూ రామారావు తన కర్తవ్యాన్ని ఆలోచించి చూశాడు

* * *

ఆనాడు వచ్చిన 'వారంటు' పుచ్చుకుని, ధర్మారావు, శంకర్‌తోసహా రామారావు యింటికి బయల్దేరాడు జీపునిచూసి, జవాను గేటు తీశాడు ఇద్దరూ జీపుదిగి లోపలకు ప్రవేశించారు హాల్లో ఎవరో ఒక వ్యక్తి కూర్చుని ఏవేవో కాగితాలు చూసుకుంటున్నవాడల్లా తలెత్తి 'ఎవరు కావాలి' అనబోయి, వచ్చినవాళ్ళని గుర్తుపట్టి, "కూర్చోండి" అన్నాడు.

"మేం కూర్చోడానికి రాలేదు" అన్నాడు ధర్మారావు

"అయితే వినండి" అన్నా డా వ్యక్తి.

"రామ రావుగారు కావాలి" అన్నాడు ధర్మారావు సోఫాలో కూర్చుని, కూర్చోమని శంకర్‌కి సంజ్ఞ చేస్తూ ఆ వ్యక్తి చొక్కా కాలరు సరిచేసుకుని, మళ్ళీ వదిలేస్తూ, "నేను వారి లాయర్ని వారితో ఏం పనో నాతో చెప్పండి" అన్నాడు

"వారిని అరెస్టుచెయ్యబోతున్నాం" అన్నాడు ధర్మారావు లేచి నించుంటూ

"హిహ్హా — ఇలాటి మాటలు నేను చాలా విన్నాను ఏ బేసుమీద వారిని మీరు అరెస్టు చెయ్యా

—41వ పేజీచూడండి

జూల్స్ వెర్న్

# భూగర్భంలోనికి సాహసయాత్ర

## జరిగిన కథ

హాంబర్గ్ నగరనివాసి ప్రొఫెసర్ లిడెన్ బ్రోక్ ఒక పాత గ్రంథం సంపాదిస్తాడు. దానిలో ఒక త్వక్పత్రం దొరుకుతుంది.

'ఆర్న సాక్నుస్సెమ్' అనే ప్రాచీన శాస్త్రజ్ఞుడు, ఐస్‌లాండ్‌లో ఆరిపోయిన ఒక అగ్నిపర్వతం ముఖద్వారంలోనుంచి భూగర్భంలోనికి వెళ్ళినట్లు అందులో వ్రాసి ఉంటుంది. తమ్ముడు కొడుకు ఆక్సెల్‌తో కలిసి ప్రొ॥ లిడెన్‌బ్రోక్ అక్కడికి ప్రయాణం కడతాడు. వారు హాన్స్ అనే గైడ్‌ను కుదుర్చుకుంటారు. స్కార్టారిస్ శిఖరం దిగువన వారికి మూడు రంధ్రాలు కనిపిస్తాయి. మధ్య రంధ్రంమీద స్కార్టారిస్ నీడ పడేవరకు కనిపెట్టుకొనివుండి, నీడపడిన రోజున ఆ రంధ్రంగుండా లోనికి దిగుతారు. కొంత దూరం వెళ్ళేసరికి వారికి రెండుదార్లు కనిపిస్తాయి. తూర్పువైపు సొరంగం లోంచి పోగాపోగా ఆదారి ఒకచోట ఆగిపోతుంది. పొరపాటు తెలుసుకుని వారు మళ్ళీ రెండుదార్లు చీలినచోటుకు తిరిగివెళ్ళి, రెండవ సొరంగంలో ప్రయాణం కొనసాగిస్తారు. కొంతదూరం వెళ్ళిన తరువాత వారికి సముద్రం కనిపిస్తుంది. హాన్స్ తయారుచేసిన చిన్న తెప్పలో ఆ సముద్రం అవలి ఒడ్డుకు బయలుదేరుతారు. ఆరురోజులు ప్రయాణం చేసినా ఒడ్డు కనిపించదు. రెండు పెద్ద జలచరాల పోరాటం చూచి వారు భయకంపితులవుతారు. ఇంతలో పెద్ద తుఫాను చెలరేగుతుంది. నాలుగు రోజులపాటు ఎటు పడుతున్నారో కూడా తెలియని నావ చివరకు తీరంమీద ఉన్న రాళ్ళకుఢీకొని ముక్కలవుతుంది

## 38

ఈ సుప్రసిద్ధ ఫ్రెంచి శాస్త్రజ్ఞులను ఉద్దేశించి మా పెదనాన్న చేసిన ఉపన్యాసం అర్థం అవాలంటే మేము ఈ యాత్రమీద బయలుదేరటానికి కొంతకాలంముందు జరిగిన సంగతులు తెలుసుకోవాలి.

మార్చి 28, 1863న బూషెడ్‌పెర్ట్ ఆధ్వర్యం క్రింద 'మూలాన్—కినాన్' పెంకాలి శిలాగనులలో త్రవ్వకాలు కొన్ని జరిగాయి. భూమిక్రింద పదిహేడు అడుగుల లోతున మనిషి పుర్రెలో భాగం ఒకటి దొరికినది. ఇది విష్ణకానికి సంబంధించిన అని నిర్ణయించారు. ఈ రకం 'ఫాసిల్'లలో ఇది మొదటిది. దాని దగ్గరగానే ఒక రాతి గొడ్డలి, ఇంకా ఇతర శిలాఖండాలు— సున్నితో కప్పబడి ఉన్నవి—దొరికాయి.

39-వ పేజీ చూడండి



మనిషి బిగువు మాట బిగువు
లఘు పాత్రలు 'మరి' తగవు
'రఘు' పాత్రలు మరి లఘువు
నోరు నగవు; నొసలు నగదు
పొగరు 'విగర్' పొంగు నగవు
పగల వగల మారి నగవు
ఒలుకును గోరోజనాల
చూడడుగా రాజనాల



చన్నీళ్ళ పోసుకోవడవూ, కటికనేల పరుండడవూ వగైరాలు కష్టాలని చెప్పిన శాస్త్రకారుడు ఈ రోజుల్లో బతికిఉంటే ఆ అష్టకష్టాలలోనూ "క్యూ పిష్టం" కూడా చేర్చేసి లిస్టు సరిదిద్దుకుని ఉండును! కచేరీ అనిపేరు పెడితే చాలు, "క్యూ" ఉందన్న మాటే.

స్టేషనులో యెదురుగుండా టికట్ల కలక్టరు కంటపడితే అడిగేను, "మెయిలు యెన్ని గంటలకి వస్తుందండి?" అని. అనునిత్యవూ అక్కడే అఘోరిస్తాడుకదా, పగలూ రాత్రీ రెయిళ్ళ చూడడం తప్ప తనికి ఇంకోపని లేదుకదా, చెప్పకూడదూ? ఊఁ పట్లాం జేబుల్లో చేతులుపెట్టి, నిటారుగా మంచుని, తలకాయ వెనక్కివాల్చి, గుడ్లు రెండూ చూరు యింటికేసి ఫోకస్‌చేసి—లేటూ గీటూ ఆలోచిస్తున్నాడు కాబోలు, యింకా యేదో చెప్తాడనుకున్నాను నేను!—

"'ఎన్‌క్వయిరీ'లో అడగండి" అన్నాడు.

ఎంత కళయజూచినా రక రకాల టిక్కెట్లు యిచ్చే కిటికీలూ, పార్శెలు ఆఫీసూ అనేకాని, యెన్‌క్వయిరీ అన్న బోర్డు అవుపించలేదు. అపాళంగా, 'మీ కొలువు యిక్కడే గనక తెలుస్తుంది, సెలవివ్వండి' అని ప్రార్థేయపడ్డాను. దాంతో ఆ యనకి యేఅనిపించిందో యేమో! కంట చూసేకాని మరి నోట మాటలేదు. చిల్లంగిపెట్టేవాడిలాగ ఓ నిముషం రెప్పవెయ్యకుండా కొరకొరా చూసి, సిగరెట్టు ముట్టించుకుంటూ స్టేషను లోపలికి పోబోయేడు. పోనీ, ఆ యెన్‌క్వయిరీ అయినా యెక్కడఉందో చెప్పవయ్యా అన్నాను, చివరికి. "అది యెన్‌క్వయిరీలోనే అడిగితే చెబుతారు. ఎన్‌క్వయిరీ అంటే అర్థం అది" అంటూ నాకోకొత్త యింగ్లీషు ముక్క నేర్పేనన్న సంతృప్తితో తన దారిని తను చక్కాపోయేడు, ఇంకా అక్కడే ఉంటే యింకా యేమి ప్రశ్నలు వేస్తానో అని కాబోలు!

ఆఖరికి ఓ కూలివాడు చూపించేడు ఎన్‌క్వయిరీ—చదువుకున్నవాడికంటె చాకలివాడు మేలని యిందుకే అన్నారనుకున్నాను—గబగబా చొరబడ్డాను, "మెయిలు యెన్ని గంటలకి వస్తుందండీ?" అని ఓ కేక పెడుతూను,

"యేఁవిటా గావుకేకలు, చేస్తూన్నపని చెడిపోవడానికి కాకపోతేను! లైనులో నిలబడండి, వెళ్ళి. ఆ క్యూలో ఉన్నవాళ్ళంతా మీలాగే పనులమీద వచ్చిన వాళ్ళుకారూ? జరీపంచ కట్టుకుని, ఉత్తరీయాలు వేసుకొచ్చిన మీలాంటి జెంటిల్మెన్ కూడా మాచేత అనిపించుకోవాలా?" మొహం వాచేటట్టు చీవాట్లు పెట్టేడు ఆ కచ్చేరీ గుమాస్తా. లైనులో ఉన్నవాళ్ళు కూడా ఓసారినాకేసి చూసి పళ్ళికిలించారు. 'పిడికి తలమాత్రమూ తెలియదేఁవా?'అని నిరసన వాళ్ళకి! గత్యంతరం లేక వరసలో చివరని వెళ్ళి నుంచున్నాను. వెధవ స్టేషన్లో రెయిళ్ళు అదేపనిగా కూస్తూ ఉంటాయి. కూత చెవినిపడేసరికి యేఁవిటో చెప్పలేని ఆందోళన! క్యూ కదలిక చూడబోతే తాబేలు పాటం.

పావుగంట అయింతరవాతగాని నా వంతు రాలేదు. అడిగేను.

"నా పని మిగతావాళ్ళపన్లా పాడుచెయ్యడానికే పెట్టుకున్నారాయేఁవిటి, స్వామీ, మీరూ? ఊళ్ళో ప్రపంచమంతా చూసుకోవడానికి వీలుగా గోడల నిండా అంటించి ఉన్నాయికదా, టైంటేబిల్సు—ఇక్కడికి యీ చేస్తున్న పని మానేసి మీతో ఆ గోడ దగ్గరకి రానా? యేఁవయినా పలుబుగా ఉంది మీరు చేస్తున్న పని?"

ఓహోహో, యీ రెయిల్వేవాళ్ళ యేం మర్యాదస్థులు! ఏదయినా పనిబడి మా కంపెనీకి రానా, అప్పుడు చెప్తాను నీ పని అనుకుని తృప్తి పడ్డాను.

ఇంక యేలాగయితే అలాగవుతుందనుకుని, టిక్కట్టుకోసం యెగబడ్డాను. అంతవరకూవచ్చి నా అవస్థకి భగవంతుడు కనికరించేడు కాబోలు. టిక్కట్లు యిచ్చే కిటికీ దగ్గిర యెప్పీ జనసమ్మర్దంలేదు. బుక్కింగుక్లార్కు ఒక్కడూ లోపలకూచుని యేదో రాసుకుంటున్నాడు. గబగబా వెళ్లి అడిగేను, "విజయనగరం ఓ టిక్కట్టు యివ్వండి" అని.

బుక్కింగ్ క్లార్కు వొంచిన తల యెత్తితేనా? వాడిరాతే వాడిది.

అతనికి వినిపించేటట్టు గొంతుక పెద్దదిచేసి మళ్ళీ అడిగేను,

అతని దీక్షకి యేమీ భంగం కలగలేదు. అతను రాత మాన్లేదు.

"విజయనగరానికి టిక్కట్టు యివ్వమంటే మాట్లాడరేఁవండీ?" తిరిగి అన్నాను.

"మినూటే మిదాయేఁవిటో, రాసుకుంటూ ఉంటేను?" అతను విసుక్కున్నాడు.

చెప్పొద్దూ, వాళ్ళ తీరు చూస్తే నాకు వొళ్ళు మండుకుపోయింది, "యేఁవిటయ్యా ఆ రాత, టిక్కట్టు యివ్వమంటూ ఉంటేను? బ్రహ్మదేవుడు రాయనేరాసేడు గుమాస్తాగిరీ మన మొహాన్ని. మనం రాయడానికి యింకా యేం మిగిలింది—ఆఁవదం!" అనేశాను.



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

# వారఫలాలు

దైవజ్ఞపాతూరి శ్రీరామమూర్తి

**6-4-1962 శుక్రవారము మొదలు 12-4-1962 గురువారము వరకు**

**మేషం :**

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

మనోధైర్యంతో ఎటువంటి కఠినమైన సమస్యలనైనా సులభంగా చేయగలుగుతారు. మీ విరోధులు చాటున అనేక రకాలుగా మాట్లాడుతారు. కాని, ఎదుటను చాలా మిమ్ములను అనుసరిస్తున్నట్లు నటిస్తూ ఉంటారు. క్రొత్త మార్గాలలో ధనాదాయం లభిస్తుంది. శుభ సంతోషంతో కాలం ప్రశాంతంగా జరుగుతుంది. వృత్తి ఉద్యోగాలలో గౌరవం, పైవారి అభిమానాలు లభిస్తవి. వారం రెండవభాగంలో మీ ఆరోగ్యంలో వ్యత్యాసలక్షణాలు తోచగలవు. ఆహార విహారాలలో తగు మార్పులు అవసరం. మీ క్రింద పనిచేయువారి వల్ల చికాకులు కలుగవచ్చు. ఈ సమయంలో ప్రయాణాలు చేయవలసి వస్తుంది. బంధువులవద్ద నుంచి సంతోషవార్తలు తెలుస్తవి. కొత్త కలయికలతో పనులు తెమలవు. 6, 7 తేదీలలో మిత్రలాభము, ఆర్థికవృద్ధి సూచనలు.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)

ఈ వారంలో ప్రవేశించిన పనిమంది మిమ్ములను ఉత్సాహంతో అనుసరిస్తారు. ఇతరులచేతికి పోయిన ధనం సక్రమంగా లభిస్తుంది. మంచి మాటలతో చెడిపోయిన వ్యవహారాలను సరిచేయగలుగుతారు. పుణ్యకార్యాలలో ఆసక్తి కలుగుతుంది. కాని, మీ శక్తిని చూచుకోకుండా భారం

> **గ్రహస్థితి**
>
> మేషంలో శుక్రుడు, కర్కాటకంలో రాహువు, మకరంలో శని కేతువులు, కుంభంలో గురువు, కుంభ మీనాలలో అంగారకుడు, మీనంలో సూర్య బుధులు, మేష వృషభ మిథున కర్కాటకాలలో చంద్రుడు.

పైన పెట్టుకోవద్దు. వృత్తిలో గౌరవం బాగానే ఉంటుంది. కాని చుట్టు ఉండే మనుష్యులను అనుసరించి మీ అధికారాన్ని వినియోగించుకోవటం అవసరం. పైకి మంచిగా కనిపిస్తూ ఎదుటివారితో పితూరీలు చెప్పేవారు ఉంటారు. ధనం ధారాళంగా చేతికివచ్చి ఖర్చుకాగల సమయం. మిత్రులు విశేష రంగాలలో బాగా ప్రకాశిస్తారు. కుటుంబ సమస్యలు కొన్ని పరిష్కారాలలో మీకు అనుకూలంగా తోస్తూ ఉంటవి. 8, 9 తేదీలలో అలంకారప్రాప్తి, క్రొత్తవారి స్నేహం.

* * *

**మిథునం :**

(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

"దూరపు కొండలు నునుపు" అనే ధోరణిలో ఈవారం మీ కార్యక్రమాలు సాగుతూ ఉంటవి. ఒకపని పూర్తిచేద్దామనుకునే సమయంలో మరొక వ్యవహారం అడ్డువస్తూ ఉంటుంది. ఈలా ఈ రెండూ నిరుపయోగమే అవుతవి. ఆదాయం తగ్గదు. అయితే మీరు అనుకున్నటువంటి విధిగా ఫలితం పొందలేకపోతారు. ఉత్తరదిక్కునుంచి శుభవార్తలు తెలుస్తవి. స్వయంకృషివల్ల మీ వృత్తివ్యాపారాలలో ప్రతిబంధకాలను తొలగించుకొని మంచి పేరు తెచ్చుకుంటారు. ధర్మకార్యాలలో పాల్గొంటారు. సభలు, సత్కారాలు మొదలయిన సంఘకార్యాలలో బాధ్యత వహించవలసి వస్తుంది. వారాంతంలో ఏది మాట్లాడితే ఏమి తంటా వస్తుందో అనే సమస్యను ఎదుర్కొంటారు. దుబారా ఖర్చులు పెరుగుతవి. 10, 11 తేదీలలో మంచివారి స్నేహం, గౌరవ ప్రాప్తి.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష)

అంతా మనదే అని పైన వేసుకొనటానికి వీలు కాదు. సంబంధం లేదని అనుకొనటానికీ వీలు కాదు. జాగ్రత్తగా మసలుకోవలసిన సమయం. వ్యవహారరంగంలో గతవారం కన్నా ప్రోత్సాహం కనిపిస్తుంది. ఆదాయాన్ని మించిన ఖర్చు చేస్తారు. కుటుంబంలో అభిప్రాయభేదాలు వస్తూ ఉంటవి. ఇతరుల కార్యక్రమాలలో పాల్గొనటంవల్ల విశ్రాంతి లేకుండాపోతుంది. మీ సౌకర్యమునకు తగినట్లుగా ఆరోగ్య సదుపాయాలు అమరక ఇబ్బంది పడతారు. ఆడంబరంమాత్రం బాగుంటుంది. స్వల్పవిషయాలలో కూడా ఆలోచన తోచక పోవటం, చికాకు కలుగుతవి. ముందు ఎప్పుడో జరుగవలసిన శుభకార్యప్రయత్నాలు సుముఖంగా సాగుతవి. 11, 12 తేదీలలో పోటీ పనులు, సంతానము.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

వృత్తిలో ఎదటివారి అభిప్రాయం తెలియక పోవటంవల్ల ముందు ఆందోళన కలుగుతుంది. ఉన్నతపదవులయందున్న స్నేహితులు సహాయం చేస్తారు. పెడమార్గంలో పోతున్న వ్యవహారాలను మీ బుద్ధిబలంవల్ల అదుపులోకి తీసుకుని రాగలుగుతారు. బంధుమిత్రులకు వ్రాసే ఉత్తరాలు, లెక్కలు మొదలయిన వాటిలో పొరపాట్లు రాకుండా చూచుకోవండి. మీరు ఎదురు

అభ్యున్నతి వార్తలు సకాలంలో అందుతవి. క్రొత్త పుస్తకాలు చదవటం, రకరకాల వ్యక్తులతో ప్రసంగించటం, అనుభవంలో సూక్ష్మవిషయాలను తెలుసుకోవటం వీటికి ప్రోత్సాహం లభిస్తుంది. సాధారణంగా ఇతరుల కార్యక్రమాలలో జోక్యం కలిగించుకొనే తగినసమయం కాదు. 6, 7 తేదులలో సంఘకార్యాలు, ఆదాయంలో పెరుగుదల, కష్ట వార్తలు.

* * *

**కన్య:**

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

ఎవ్వరు ఏవిధంగా భావించినా మీ బుద్ధిబలంతో నిరుత్సాహపడకుండా మీ ప్రయత్నాలను సాగించగలుగుతారు. మీ ఆరోగ్యం ఇంతకుముందు కన్నా బాగుంటుంది. ఒకరి సమాచారం మరొకరి వద్ద ఎత్తకుండా జాగ్రత్త పడవలసిన సమయం. కుటుంబంలో తలపెట్టిన పనులలో బాధ్యత పెరుగుతుంది. అనుకోకుండా స్నేహితులనుంచి దుర్వార్తలు వినవలసివస్తుంది. ఆదాయ మార్గాలలో మధ్య మధ్య అభ్యంతరాలు ఏర్పడగల సూచనలున్నవి. భూములమీద కాని, యంత్రాలు మొదలయిన వాటిమీద కాని ధనం వినియోగించవలసి వస్తుంది. ఏపనిలో ప్రవేశించినా దానియందు బుద్ధిని స్థిరంగా నిలుపలేక పోతూ ఉంటారు. సంతోషకార్యాలలో ఆటంకాలు వస్తూ ఉంటవి. లభించిన అవకాశాన్ని సకాలంలో వినియోగించుకోలేకపోతారు. 8, 9 తేదులలో ప్రయాణాలు, అధికారుల పరిచయం.

* * *

**తుల:**

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

సంఘంలో గౌరవప్రదమైన సకాలం. దేహ సౌఖ్యం లేకపోవటంవేత ప్రాతనములు, వ్యవహార పరిష్కారాలు వాయిదా పడుతూ పోతవి. సహాయం చేస్తామని చెబుతూ కాలం దాటవేసే మనుష్యులు తటస్థపడతారు. దైవబలం బాగుంది. విలువగల వస్తువులమీద డబ్బు పెట్టుబడి పెట్టగలుగుతారు. వారం ఆరంభంలో మిమ్ములను కలవరపెట్టిన వార్తలు వారం రెండవభాగంలో శుభాంతంగా మారుతవి. ఎవ్వరినీ అప్పు అడగతగిన సమయం కాదు. నౌకరులతో కలహాలు వచ్చి సమసిపోతవి. ఉష్ణాధిక్య వల్ల నరములయందు బాధ, నిద్రపట్టకపోవటం, బలహీనము ఇవి ఉంటవి. స్వల్పకారణాలకు కూడా ఉద్రేకం కలుగుతుంది. రావలసిన డబ్బు చేతికి అందే వరకు నమ్మటానికి వీలుకాదు. 10, 11 తేదులలో అకస్మాత్ ధనలాభం, శుభకార్యాలు.

* * *

**వృశ్చికం:**

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

స్నేహితులు ఏమి చెప్పినా సరేనని చెబుతూ చక్కగా మీ మార్గానికి త్రిప్పుకోగలుగుతారు. ప్రయాణాలలో శ్రమ కనుపిస్తుంది. ధనాదాయం బాగుంటుంది. మీ దినసరి కార్యక్రమాలలో శ్రమ, నిదానము కనుపిస్తవి. అయితే ఓర్పుతో కొనసాగించగలుగుతారు. బంధువుల వద్ద నుంచి శుభవార్తలు తెలుస్తవి. ఆరోగ్య విషయంలో శ్రద్ధవహించవలసిన సమయం. మీ సహాయంతో పైకివచ్చినవారే మీ మాటను వ్యతిరేకించటానికి చూస్తారు. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి. వ్యవహార రంగంలో నూతన మార్గాలను అనుసరించవలసి వస్తుంది. మీ సహాయం కోరి వచ్చేవారు ఎక్కువగా ఉంటారు. 7, 8 తేదులలో సంఘంలో గౌరవం, విశ్రాంతిలేని పనులు.

* * *

**ధనుస్సు:**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

సమయం అంత సుఖంగా తోచకపోయినా దైవంమీద భారంవేసి మీ వ్యాపార వ్యవహారాలను క్రమంగా సాగించగలుగుతారు. కుటుంబ విషయాలలో ప్రోత్సాహము, సుఖము లభిస్తవి. తరచు పదిమందితో కలిసిమెలిసి చేయవలసిన పనులలో ప్రవేశిస్తూ ఉంటారు. ఇతరులతో మాట్లాడే సందర్భాలలో యదార్థంకన్నా యుక్తి అవసర అవుతుంది. మీ క్రింద పనిచేసేవారు శ్రద్ధతో ప్రవర్తించటంవల్ల పెద్దమనుష్యుల వద్ద మీ గౌరవం పెరుగుతుంది. సాహస కార్యాలయందు ఆసక్తి కలుగుతుంది. అంతలోనే పరిస్థితులు చల్లబడుతవి. వారాంతంలో బంధువులవద్దనుంచి అసంతృప్తికరమైన వార్తలు తెలుస్తవి. మధ్య మధ్య చిక్కులు కనిపిస్తున్నా ఆదాయం పెరుగుదలలోనే ఉంటుంది. 9, 10 తేదులలో కలహ ప్రసంగాలు, దండుగఖర్చులు.

* * *

**మకరం:**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఇంతకుముందు ఆదుర్దా కలిగించిన వార్తలు చివరకు సులభంగా తేలిపోతవి. ముందుముందు జరుగతగు కార్యక్రమాలను చక్కగా ఊహించగలుగుతారు. మనోనిగ్రహం బాగుంటుంది. మీ అవసరాలకు ధారాళంగా ఖర్చుపెట్టతగిన అవకాశం లభిస్తుంది. వ్యవహారవిషయాలలో ఇతరులను అనుసరించవలసిన అవసరం లేకుండా పోతుంది. విద్యార్థులకు బుద్ధి చక్కగా వికసించగల సమయం. ఆడంబరమైన పనులయందు వినుగుదల తోస్తుంది. మాటలలో అప్రయత్నంగా ఎదటివారిని నొప్పించటం జరుగుతుంది. వృత్తి ఉద్యోగాలకు సంబంధించినవార్తలు త్వరగా వస్తవని అనుకోవద్దు. వస్త్రాలు, అలంకార వస్తువులు మొదలయినవి కొంటారు. 11, 12 తేదులలో దేహశ్రమ అధికము, జరిగిన పొరపాట్లను గురించి ఆందోళన.

* * *

**ఈ వారము ధరలు**

బంగారు ధర మందీలో నిలుస్తుంది. వెండిధర వారం చివరలో మందీ వస్తుంది. పసుపునకు గిరాకీ బాగా అవకాశా ఉన్నవి. నూలుధర క్రమంగా తేజీ వస్తుంది. అయితే వారాంతంలో తగ్గే అవకాశా ఉన్నవి. మిర్చిధర పెరుగుతుంది. చింతపండు ధర గతవారం మాదిరిగానే ఉంటుంది. ఇనుము, యంత్రాలు వీటి ధరలో పెరుగుదల వస్తుంది. ధాన్యం ధర మందీలో నిలుస్తుంది.

**కుంభం:**

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

అధికారం పెరుగుతుంది. అందరిని సంతృప్తి పరచగలుగుతారు. అనారోగ్యంచేసి వెంటనే నెమ్మదిస్తుంది. అనుకూలమైన సలహా చెప్పేవారు లభిస్తారు. అపవాదులు వచ్చే సూచనలు కనుపించవచ్చు. అంతమాత్రమున భయపడవలసిన అవసరం లేదు. ఆదాయం బాగా పెరుగుతుంది. అసందర్భపు ప్రసంగాలతో దించి మిమ్ములను చికాకుపరిచేవారు ఉంటారు. అప్పుడప్పుడు కుటుంబంలో దుబారాఖర్చులు వచ్చి పడుతుంటవి. అయితే మీ కోర్కెలు సకాలంలో ఫలిస్తవి. అధికారుల ఆదరాభిమానాలు లభిస్తవి. అధైర్యపు మాటలు చెప్పి మీ ఉత్సాహాన్ని భంగపరిచేవారు కూడా తటస్థపడతారు. అతి జాగ్రత్తగా ఉండటం అవసరం. 6, 7 తేదులలో అధిక వ్యయం, ఆందోళనకర వార్తలు.

* * *

**మీనం:**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

తోటివారితో కలవలేని పరిస్థితులు ఏర్పడుతవి. ఆలోచనలు ఒకవిధంగా సాగవు. అవకాశాలు మిగిలిపోయినతరువాత ఆందోళన పడవలసి వస్తుంది. ఈ సమయంలో అదనపు ధన వ్యయం కనుపించినా పదిమందిలో అపవాదు రాకుండా చూచుకోవండి. వృత్తివ్యాపారాలలో ముందు జాగ్రత్త, నౌకరులను అదుపులో ఉంచుకొనటము అవసరం. ఉష్ణాధిక్యంవల్ల దేహ బాధలు ఏర్పడుతవి. ఫలితం ఎదురు చూడటానికి అవకాశంలేని గౌరవపదవులను నిర్వహించ గలుగుతారు. సంచారంతో కూడిన కార్యక్రమాలు. శుభసంతోష కార్యాలలో పాల్గొంటారు. కాని అసంతృప్తి తోస్తూ ఉంటుంది. సాహసం పనికిరాదు. 11, 12 తేదులలో ఆలోచనలకు విఘ్నం, స్వల్పలాభం.

# డాక్టర్ రాజు

బొమ్మల కథ
దేవిక
19










డాక్టర్.రావ్ మీద నాకు గౌరవం ఉంది. ప్రేమ మాత్రం కాదు---






## మూడవ బహుమతి వ్యాసం :

# నేటి మన సినిమాలు

### టి. ఎల్. ఎస్. ప్రభావతి

ఏ ఇతర వినోద, సాంస్కృతిక కార్యక్రమాలు, చవకగా లభించని మనదేశంలో అందరికీ అందుబాటులో ఉన్నది సినిమాయే అయింది. నాటినుండి ప్రజలు చాలావరకు వినోదంకోసమే సినిమాలను చూస్తున్నారనవచ్చు. కనుక చిత్రాలు నిర్మించేటప్పుడు ఏ ఉద్దేశాలు, సంస్కరణలు దృష్టిలో పెట్టుకున్నా, వినోదమనే అంశాన్నిమాత్రం మరువకూడదు. అలాకాక కేవలం సంఘాన్నుద్ధరించే ఉద్దేశంతోనే వినోదాత్మకం కాని చిత్రాలను నిర్మించి మూడుగంటలు విసిగిస్తే సినిమాకు వినోదపువన్నుతో సహా చెల్లించిన ప్రేక్షకులు నిరాశచెందటం సహజం.

ఈ నాడు తెలుగుసినిమా అనేటప్పటికే పెదవి విరచటం జరుగుతోంది. మన సినిమాలస్థాయి దిగజారిందని విమర్శలుకూడ వినవస్తున్నాయి. ఇతరభాషల చిత్రాలను చూస్తూ తెలుగుచిత్రాలను చూడని తెలుగువారనేకంగా వున్నారు. కారణం మన సినిమాల స్థాయి, అందలి అసహజత్వం రగానేనని వారంటారు. ఇందులో కొంతవరకు నిజ ముందనిపిస్తుంది.

తెలుగు సినిమాలస్థాయి సాంకేతికంగా పెరిగిందనడానికి సందేహంలేదు. అయితే ఎంతవరకు వివిధంగా అభివృద్ధిగాంచిందనే అంశాన్ని గమనించాలి. అన్ని రంగాలమాదిరిగానే సినీరంగం కూడ అభివృద్ధిచెందింది. దీనికి కారణం ముఖ్యంగా విదేశాల్లో వృద్ధిపొందుతూన్న శాస్త్రపరిజ్ఞానం గాని, మనప్రతిభమాత్రం లేదు. ఉండకపోగా మనవారు చేయగల్గింది కథాచిత్రణ, దర్శకత్వం మొదలైన రంగాలను ప్రతిభావంతంగా నిర్వహించడమా? దీనికికూడ మనకి వరవడి పెట్టడానికి హాలీవుడ్, బొంబాయిలు ఉండనేవున్నాయి. మనవారిలో ప్రతిభావంతులైన దర్శకులు, కళాకారులు ఉన్నారు. కాని అందరికీ తగిన అవకాశాలు లేవు ఉన్నవారు కొందరు మనకెందుకబ్బకష్టంఅని తేలికగా బొంబాయివారు చూపించిన దారిలో నడుస్తున్నారు.

పూర్వం వచ్చిన తెలుగు సినిమాలు సాంకేతికంగా బ్రహ్మాండంగా లేకపోయినా వాటిలో ఒకవిధమైన నిండుతనం ముందనిపిస్తుంది. ప్రతికళాకారుడు శ్రమపడి పనిచేయడం కారణం కావచ్చు. లేదా అప్పుడు సులభంగా అనుకరించడానికి హిందీ సినిమాలు మనప్రాంతాలలో ఎక్కువగా విహరించకపోవడం కావచ్చు. అప్పటి చిత్రాలలో కవిత్వం, పాటలు, మాటలు, సంగీతం బాగుండేవనడం అతిశయోక్తి కాదు. రాను రాను కథలు, పాటలు, సంగీతం అన్ని మూడు భాగాలలో తెలుగుసినిమాస్థాయి దిగజారిందనటం దుస్సాహసం కానేరదు.

సంగీతం విషయం చూస్తే అంత ఆకొంటతనంగా ఉండటంలేదు అంతంత మాత్రంగానే ఉంటోంది. "బొంబాయి"వారి ప్రభావం అధికంగా కనబడుతోంది. కాపీకవ్యాల విహారం తెలుగుసీమలో ఎక్కువైనది. కాని బాధ్యత సంగీతదర్శకుంది మాత్రమేకాదు.

కథవిషయం: ఇప్పుడు తయారవుతున్న తెలుగు చిత్రాలలో నూటికి తొంభై చిత్రాలలో కథ ఒక్కటే. దానికి తోడు చాలావాటిలో హీరోకూడా ఒకడే అవడంతో అన్ని సినిమాలు ఒకటేననిపిస్తున్నాయి. వీటన్నిటికీ తప్ప, దర్శకులు, నిర్మాతలు క్రొత్తతరహా కథలను తెరకెక్కించడానికి భయపడుతున్నారు. సాహసించినవ్యక్తులు, మనకు ఎక్కువగా కనబడటంలేదు. దీనికి కారణం—శాస్త్రీను భయమే! సాధారణంగా క్రొత్తగా వుంటుందని ఏశరత్ కథనో తెరకెక్కించినా, శరత్‌ను మార్చి తెలుగు "సినిమాతనాన్ని" దానికి పులిమి మళ్ళీ యథాప్రకారంగా తయారుచేస్తున్నారు. ఇలా చెప్పుకోడానికి మిగిలిందల్లా శరత్ కథను తీశామన్న అభిమానమే. పూర్వం తెలుగు సినిమాలు మాంచి



శ్రీమతి టి. ఎల్. ఎస్. ప్రభావతి

కథలతో వచ్చేవి, సంఘసంస్కరణలు చేసేవిగా వుండేవి......ఇప్పుడుకూడ అలాంటివే కావాలనడం కూడ అర్థంలేదు. అవి క్రొత్తరోజులు కనుక ఏసినిమా తీసినా బాగానే ఉండేవి. ఇప్పుడు తెలుగు నిర్మాత హిందీ సినిమాల పోటీకికూడ తట్టుకొనవలసి వస్తోంది. కనుక సంఘాన్నంతటిని ఉద్ధరించే సినిమాలు తీయవలసిన అవసరం, అవకాశం తక్కువ.

—37వ పేజీ చూడండి

# నేటి మన సినిమాలు

### ఆర్. కుమార్

సాహిత్యం (Literature) మాటలమీదనున్న వేరే ఏ సాధనం ( Medium) మీదా ఆధారపడదంటారు. మహాకవుల రచనల విలువ 'అచ్చు పేపరు' మీద అచ్చుగుద్దినంత మాత్రాన ఎక్కువ అవదు. కాని చిత్రలేఖనం, శిల్పం మొదలైన లలిత కళల సంగతి వేరు. 'కళాకారుడు' వాడే 'సాధనం' యొక్క ప్రభావం అతని సృష్టి మీద బాగా తెలుస్తుంది.

చలన చిత్రాలు ఒక క్రొత్తరకమయిన కళా సాధనం. అంతేకాక ప్రపంచంలోనే ఒక పెద్ద పరిశ్రమ. భారత దేశంలోనూ అంతే. మన దేశంలో నిరక్షరాస్యులు అధికంగా ఉన్నారు. తక్కినవారితో బాటు, వీరికి చలన చిత్రాలు వినోదం కల్పిస్తున్నాయి. కాని సినిమాలు చూసే వారిలో కొందరయినా చదువుకున్నవారు ఉండకపోరు. కాబట్టి మన చిత్రాలపరిస్థితి ఎలా ఉందో పరిశీలించటం చదువుకున్నవారికైనా అవసరం.

ప్రస్తుతం మన సంస్కృతిలో విషయం తీసుకున్నా పాశ్చాత్య దేశాలతో పోలికలు తప్పవు. స్థూలంగా చూస్తే మనం ఇంచుమించు అన్నివిధాల వెనకబడే ఉన్నామని ఒప్పుకోవటంలో తప్పేమీ లేదు. ఇంచుమించు అప్పుడప్పుడే కొన్నివిషయాలు మినహాయించటం జరగాలి; సాహిత్యానికి సంబంధించినంతవరకు మన రచయితలు కొందరు ప్రపంచంలో ఎవరితోనైనా సరితూగుతారు.

ఇక మన చలన చిత్రాలు విదేశీ చిత్రాలతో పోల్చి చూడాలి. 'మన' చిత్రాలన్నప్పుడు తెలుగు చిత్రాలనే ఉద్దేశించి రాస్తున్నాను. (సత్యజిత్ రాయ్ చిత్రాలు తప్ప మన దేశంలో మంచి సినిమాలు తీయటమేలేదు. ఈయన చిత్రాలు బయట దేశాలలోనే బాగా ఆదరింప బడుతున్నాయి.) పోల్చి చూస్తే విచారం కలుగకమానదు. ఒక్క మాటల విషయంలో తప్ప అన్నివిధాల మనచిత్రాలు దేశంలోని తక్కిన కళాసాధనాలన్నిటికన్న మరీ వెనుక ఉన్నాయని తెలుస్తుంది.

ఈ సినిమా మాటలు—మన అదృష్టం కొద్దీ—ప్రఖ్యాత రచయితలే చాలా మటుకు రాస్తున్నారు కనుక అసంతృప్తి కలిగించటంలేదు.

—37 వ పేజీ చూడండి

---

పోటీలో బహుమతి పొందకపోయినా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాము.



రోహిణీకార్తె ముదిరింది. రోజు ముద్దులక్ష్మి మ్రోగింది. ఆ దుండుడుకు పైరగాలి కెగిరి తీగా పందిరిమీది మారాకుచాటు మల్లెమొగ్గ మళ్ళీ ఒళ్ళు విరుచుకుంది. పడుచుదనం—ఉప్పొత్తుమ్మి బాజాబందు ఒరుసుకుంది.

పన్నీరు ఘుమఘుమ లాడంగా, పచ్చ కప్పురము ఘుమఘుమలాడి పానుపు అమరించంగా, మంచి గంధము సమ్మతంగా రొమ్ము కమ్ముకోగా, పైతీపి కిసమసగా, కినరుగా, బిడిముడిగా, పడిగా విడిగా, పట్టు తప్పి, కట్టు తప్పి, బిడ్డకానికి పవ్వళింపు సేవ చేసింది:

—అర్థం చేసుకోవే అమ్మడూ!

కొండంత ఎండ కాచేది, కొసరు వెన్నెలకే— పూజలకు పూసే పూవుల్లో పుట్టి, మన కులం యీడేరింది, పురుషుడు చేసుకున్న పుణ్యానికే—!

—చినీ చినీ, రాజాయి చిన్నకూతురు, కాళ్ళ పారాణి, జరీ కుచ్చెళ్ళు రాపాడంగా, పెదవి బెదరి— మునివేళ్ళ మెటికలు విరిగి, కాటుక కళ్ళు కసిగా సోకు చేసుకోగా, ఆ సైసం చూసి, ఆ వాలకం చూసి,— చూసీచూడనట్టు అబ్బురాలుపోయి,—

"అసి బంగారంలాంటి భడవా! ఆ మురుముకే అలా వాటుచేసుకోవే,—మొనగాడైనా మోకాటువడేను!

ఆ చూపులే నీ కళ్ళ కాపురం చేయనీవే,—పళ్ళ మూలిన వాంకాన వచ్చి, కోసేవాడు—చేకొనేవాడు చాలినంత సంబరపడేను!

పెదవితో, అలా—అలా సుతువుగా బెదరించవే,—మన విలువ మరీ మరీ హెచ్చేను. అన్నీ తెలిసి అమాయకురాలివై మెలగవే,—చెంగాటానికి చెంరేగిన వాడువేలన్నైనంత మెచ్చేను!

అమ్మడూ! సంతోషపడంగావే,—చల్లగాలి సావిడాదకు మళ్ళేను కావి,—స్వగృహంలో కూర్చుకుని సంధ్యావందనం చేసుకొనేవారూ—తరసుకైనవారు,—చాలినవారూ, మడికట్టుకున్నంత మక్కువతో, అనుష్ఠానం తీర్చుకునేంత అక్కరతో, పనివేళా, యిలా దయ చేసేరు:

దయచేయుమీ .... అస్మైవ మత దయః

పరగణాలో, ఓరచూపు పొందకారుల—దోర మనసు నిలవనీయనితనం,—ఆశించినవారు నిలువ లేని తమకం, మనయిలువానికి, వేసివేయని పరువే!

కలవా రనకునేరు కదా,—మన కులానికి పాత పాట, రూకలున్న లోకానికి రాచబాట—ఆమాటే ఘనతగా, కలకాలం మనకు దక్కాలి, అమ్మడూ,

పట్టెపానుపుమీద పవ్వళించంగ, పడక సేయంగా విరవళ్ళు పోయేవాడు, పడిమంతరవు ఒడిదుడుకుల పడుచువాడి పనుకొనేవాడే కానీ,—కానిపోని పతాకున వచ్చి, వరాలు కొంగున కట్టి, బిరుదు మగవి వలె బింకాలకు పోయి, గడియో, అరగడియో పళ్ళ బిగివిని చేపట్టి, అల్లంతకే, అవంతకే ఆదమరచే పనుకొనే, అద నెరిగిన పడుచు ముదునరి కానీ,— రానీ!—అది వారి గీత!—రేపూ మాపూ లేక పండిన వారిదే బాలభోగం—

అమ్మడూ ! అగురు ధూపం, అత్తరుపు దీపం, పది కాలాలపాటు, మన పడకటింట రాజ సాలు పోవలెనే !—ఆ ఆనవాయితి తప్పరాదమ్మ !.., రమ కన్నవానికి,—సరసాలకు దైన మనుకున్నవానికి. కలనైన తలవంపులు కారాదమ్మ !

మా బాల కన్నులు పద్మాలబోలు! అని

అయిన నలుగురికీ తెలిసేందుకు తలవాకిట పద్మాల ముగ్గులు వేయించాను: తీరని కోరికల వారు, తీర్చైనవారు, రాజసాలవారు రాజ్యాలవారు, కుదురైనవారు మక్కువ లున్నవారు, సంబరాలు పోవగా,—బహుపరాక్‌గా, గుమ్మానికి, జంట తోరణం కట్టించాను. అంతఃపురాలవారలు కాము,- అందుబాటులో వారమే, కాని, పుణ్యానికి పోయే గణ్యతే మాది,—అని హెచ్చరికగా, మన ముందువాలో చిలకపంజరం మాధవస్వామి కోయి లకు జేర్చాను. అది,—అక్కడ జేరిన పెద్ద లందరికీ కనువందు వాయెనే !— అందరిమాట కేమిగాని,—మామిడితోటలో సోమయాజులుగా రున్నారే,—వా రంతటివారు, ఏనాటి మురిపెమో, ఏనాటి ముచ్చటో జ్ఞాపకం తెచ్చుకున్నారో ఏమో —అట్టే నావంక అదో తీరుగా చూసి, అనుకో కుండానే అడుగు ముందుకువేసి, పిన్న లున్నారనే సంకోచమన్నా లేకుండా,—

'రాజాయీ, మీ తోటలో వన్నజాజి పూసిందా, సంపంగి పూసిందా—మరుమల్లె పూసిందా, మన్మథ బాణం పూసిందా !" అని, అనువుగా, చెక్కిలి నిమిరి వంతా చనువుగా, మన కుశల మడిగినారే.

అప్పుడు నేనేమని మనవి చేసుకున్నా నను కుంటివి !

'పెదుచువారై యుండగా పదేపదే మమ్మ దీవిం చువారు—మా లోగిలి మరియాదలు తమకు తెలి యనివా? జాజులూ, మల్లెలూ జడపాయకే—సంపం గులూ, గొజ్జంగులూ సిగపాయకే—వాటి వైభో గము అంతవరకే—

మా తోటలో, వేసింది తులసి మొక్క—పూసింది పారిజాతం. ఆ పూతైనా ఆడంబరానికి కాదు. అర్చ నకు కాదు. ఏనాటికైనా,—ఎండకన్నెరుగని ఏకాంతసేవకే—పెదవి కదిలితే, కెంపులు మురి సేను. కన్నార నవ్వితే నీలాలు కురిసేను. మన సార పలుకరించగా, మాణిక్యాలు మెరసేను—వయసే ఆరతి ! వయారమే అర్చన ! .... అందుకు ముచ్చట కడే,—స్వామివారు, లోకంలో కులమింటి కన్నె లకు అలవిమాలిన వరాలు, మా వరం జేసేరు. పూవులు పూజలకైతే—యీ పుణ్యం మా కబ్బదు. ఇంత గణ్యత మాకు దక్కదు. మా యింట కులికేది, మంచి ముత్యము కాదా !—'

ఈమాటకు వా రుప్పొంగినారు.

'మంచి ముత్యమైతే,—నీ మహారాజు వర మయినో'—అని చమత్కారాలు పోయినారు.

'మా యింట, ఆ కథ పుట్టరాదు !—అని నే లెందుకున్నాను.

అదే మాకు ఆనందం ! అన్నారు వారు.

మీ ఆనందమే మా ఐశ్వర్యం ! అని మనసు లోనే అనుకున్నాను నేను.

అమ్మడూ, పెద్దల కటాక్షం అలా మన మీద ఉన్నది గనుకనే యింత వృద్ధికాముల

# రాగమాలిక

మైనాము. సానులమైనా—కానివారికి దాసోహ మనలేదు. మన అంతస్థుకు తులదూగని మారాజు నైనా మన్నించలేదు. ఔనమ్మా ! ఆ కథ నీవు వినలేదు కాదూ !

మా ముత్తవ, పేరుకు మాధవీలత—రూపుకు మెరుపుతీవె,—వేయి దివిటీల తళుకుతో, వెన్నె లంత కులుకుతో,— నిలువు పాపిటతో, నిండు వాల్జడతో,— మాధవస్వామివారి ముఖమంటపంలో —కులదైవానికి వాల్జాపుల తొలిసారి మన్నన లిచ్చేందుకు, శృంగారంగా నిలువంగా,—వరగణాలో వారు, పేరుపేరున కానుకలు పంపంగా,—పెద్ద లందరూ కొలువుతీరి ఉండగా,—తా నేర్చిన విద్దెలు దేవరకు విన్నవించుకున్నదై,—బింకాన బిడియాన పెద్దలకు మ్రొక్కి—పిన్నవారిని చూసి చిరు నవ్వు నవ్వి—ఆ కానుకలూ, కట్నాల వంక కన్నెత్తి చూడక—తల వంచుకుని, తన దారిని తాను రాగా—అందరూ—అదేమా అని విస్సెర పోయినా

"ప్రపంచంలో న్యాయమనేది లేకుండా పోయింది ! లెక్కప్రకారం ఆదాయపుపన్ను కడితే చిప్ప చేతికివస్తుంది. కట్టకపోతే జైలు కెళ్ళాల్సివస్తుంది" ఒక వ్యాపా రస్తుడు మిత్రుడితో మొరపెట్టు కున్నాడు.

ఎ. రామమూర్తి (హైదరాబాదు)

రట !—ఎన్నడూ లేనిది ఏమీ విద్దూర్య మను కున్నారట !

ఔనమ్మా !—మన యింట బాలాకుమారి వరు పుకు వచ్చిం దనంగా,—స్వామివారి సన్నిధిలో నాట్యం చేయడం, మనసైనవారు కానుకలు పంపడం,— అన్నింటిలో ఎన్నికైనది, తా నందుకోవడం— అక్కడి పెద్దలు ఆమోదించడం—అలవాటు. తాము పంపిన కానుకలు, చిన్నది స్వీకరించిందని, ఆ ఫలానావారికి తెలియంగనే—వారు సంజ పొద్దుకు తరలిరావడం, ముద్దులూ, మురిపాలూ యిచ్చుకోవడం, సరసను జేరి పాయసం పుచ్చు కోవడం—ఆచారం !

అది—తల్లక్రిందులు కాగా—అందరి మాటకేం గాని,—ఆ మారాజు బిత్తమాత్రం మహాఉగ్రుడై పోయినాడట !—

ఔను, వారు మరి సామాన్యులా—వారి పెద్దలు వాసిరెడ్డి వెంకటాద్రినాయుని వారి హయా ములో రాజ్యం చేసినవారట! అప్పటికే రాజ్యం అంత రాజసం వారిది. బలిమి ఎంతో బింగ మంత ! కలిమెంతో కార్పణ్య మంత !—

నిప్పులే తడవుగా పాలకీ బోయీలను పంపింది వారట. పట్టి తెమ్మని బంటు నంపినారట. వానికి వత్తాసుగా విచ్చుకత్తుల వారి నంపినారట !— అంతకూ చాలదేమో అని దివిటీలవారి నంపినా రట ! పాలకి ఎక్కనన్నదో ఆ యిల్లు పరశురామ ప్రీతి చేయమన్నారట !—

ఇది ప్రళయమే అని ప్రజ లనుకున్నారు.

మాధవి మాత్రం తొణకలేదు!

'పట్టపురాణులమా ! మాకు పాలకీ లెందుకు !— పాదచారులమయి వచ్చేము. పదండి.'

మరొక్కమాట !—సంతలో దొరికే సరుకు కాదీ రూపు. చాలినవారి దర్పానికి బెదరిపో దీ చూపు !

స్వామివారి వరాన్ని నేను. పరువెరిగి వచ్చి ప్రసా దంగా, స్వీకరించమనండి' .... అన్నదట !

నిజాని కిది దురుసుతనమే,—కాని, వారూ ఏ కళ నున్నారో—పైగా, ఆలయానికి దయచేయ మంటే భీష్మించుకోవడం అపచార మేమో, అక్క డికి రానేవచ్చారట.

రాంగానే,—చూసీచూడన ట్టూరుకుందిట.వారు మరింత చేరువ కాంగానే,—

మ్రొక్కాలి !—అనేసిందట !

ఆ—తనకు మ్రొక్క మన్నదిగా, యీ ధగిడే! అనుకుని వారు అట్టే మిడిసిపడ్డారట. అలంకా రంగా ధరించుకున్న కరవాలం ఒడిసి పట్టారట ! హుంకరించారట. అవలాన, మాధవి కిలకిల నవ్వి, సుతారంగా పిడికిలి పట్టి, తర్జనితో స్వామివారిని నిర్దేశించిందట— కాని అప్పటికీ వారు గ్రహించ లేకపోయిరట !

అంతలో మాధవి అన్నదట కదా—

'అయ్యలూ—మోహాలు నేర్చిన వాడవు మ్రొక్కించుకోలేవా !—సాము నేర్చినవారు సర సాలు నేరరా !

మానధనులట మీరు: మాధవునికి కేలెత్తి మ్రొక్కితే మగ సిరికి లోటనుకునేవారు: దేవర సన్నిధిని సాగిలపడి 'దేహి' అనలేరా వారు:

వారి దీ తీరైతే 'యాహి' అని నే ననలేనా—?'

విని విని, వా రంతలో, తెలుసుకున్నవారై— సన్నిధిలో సాష్టాంగపడినారట. మాధవి వారి శిరస్సును, వామపాదంతో పరామర్శించిందట.

అది, పరాభవ మనుకున్నారు వారు!

మాధవి, మరి ఒక్కసారి నవ్విందట !

అయ్యలూ—అలవాడు మీరు, అనుభవించిన ముచ్చట. - అర్థముకాలేదు వీరికి-ఆయెనో ! ఆ యోగం లేదు వీరికి—' అంటూ వారి వంక అప్పటికి చూసి,—

శ్రీమంతులవారూ !—వరసంతో బడ్రనేటు తినడం సామాన్యం. చిలిపి సేతలకు మెర మెచ్చుగా చెక్కిలి నొక్కులమీద ముక్కున పడటం అతి సామాన్యం ! బలిమాలి ప్రణమిల్లి, ప్రస న్నుమ చేసుకొనే పరవశాన పాదతాడితులు కావడం—మహామహులకే మహాప్రసాదం.

పారిజాతం కథ తాము వినలేదు కాబోలు.

ఏవో చిడిముడిసేతలు చేసి,— కామేశ్వరి కన్నె వరు కాగా,—ఆదిదేవుడు, అంబ పదముల ప్రాలినా డట ! ఆ సాటుకు ఆ తల్లి, పదముల, అంబెలు

## రాగమాలిక

అనుకుంటూ స్వామికి మ్రొక్కినవార్లై—మాధవి వంక చూసి,—

మిమ్మల్లను గురువులుగా వరించాము—అవంగా, మేమూ, మిమ్మల్లను వరించాము, అప్పుడాయను ఏతీరున—

మా తీరున: దైవాన్ని సేవించడం, దైవ సములకు సపర్యలు చేయడం— మావ్రతం—రంభ కులమయ్య మాది: తాపో సన్యాసి, తనకీ తగులాట మేమో అని అనుకునేనా,—పోనీ, గురుదక్షిణ దయ చేయండి— గురుదక్షిణ ఏమా,—పుత్రభిక్ష!— పతితులు కావద్దు— పొంకోచమే వద్దు— స్వామి సన్నిధిలో [illegible].

[illegible]—[illegible] బృహదారణ్యములు తపములోని బృందావనములు ప్రవహించే యమునానది నరవశమే రాసలీల— యమున పొంగే యోగ సాధన—! కావా!—

వేదమే—వేసల్లెవాడు!— నాదమే నందునిమేడ మాధవుడే పాడేపాపడు—ఎదుటనున్నదే యశోద— కాదా!

స్వామి. కలత నిదురలో కలవరించినట్లు— అమ్మా! అన్నారట—మాధవి ఉప్పొంగి పోయినదట— దేవేరమ్మా! నీదివెన దక్కినదమ్మా!— అమ్మా అనిపించు కుంటినమ్మా! అన్నదట!—

ఆ మాధవి, ఏమైందంటావా!—మాధవ స్వామికి తెలియాలి! మరల నరమానవులకు కనిపించలేదు— పుణ్యాత్మురాలు!—

అమ్మడూ—రాజాకు వంకలు దిద్దింది!
సన్యాసికి సన్మార్గం ఉపదేశించింది:
సానిపాప కనుకనే—ఆపాపం మట్టింది:
ఆసాధన అబ్బింది: ఆపునఠ, ఆగడిము,

తలవంచుకుని,— తాళి కట్టించుకుని,— తల్లి బ్బులయే బదువరాంధ్ర కెక్కడిదమ్మా: వారికి భర్తయే దైవం: దైవమే సువభర్త—ఆ దైవానికి తలవంచే ధర్మదాసులను: పరులకు [illegible] కాము:

ఇది, సంసారుల నింద కాదమ్మా!— వారు అలాగే వర్ధిల్లాలి: సంగీత నాట్యాల లోకానికి దైవ సాక్షాత్కారం చేస్తూ,-నేరనివారికి సరసత నేర్పుతూ, మాధవునికి ప్రతినిధులన్నై మన మీలాగే వర్ధిల్లాలి:

సవర్లైన సానిపాప లోకానికి రక్ష:
సానులు సంసారులైతే—లోకానికి శిక్ష:

దేశంలో కళాకాంతులుండవు: సరసాలకూ, లలిత కళలకూ సాగరమే గతి!—

అర్థమయిందా—అమ్మా!—యిక ఆ ఆలాపన కట్టిపెట్టు: కలతదీరి కలకలలాడవే— కలకండ పుక్కిట పట్టవే— గొంతు నొవ్వకపోగా, గోరు వెచ్చగా ఉండేవు: పాయసాలు మాని, పనసతొనలు మెక్కవే— చిక్కిచిక్కక వలపించే చిలిపితనాల వేళ,—వేళకు, వట్టుమని వంటికింది కావేమే!

అమ్మడూ: మనకథ విన్నావు
కలిలోంచి మేలుకున్నావు: ఇక—
కన్నులద్దుకో—ఒళ్ళు సద్దుకో,
వచ్చేవారిని [illegible] కావద్దు—[illegible] దిగివి
దిద్దుకో! ★

# 8-వ బహుమతి వ్యాసం

31వ పేజీ తరువాయి

అందువల్ల ముఖ్యంగా వినోదాత్మకమైన చిత్రాలను నిర్మించడం అవసరం. ఈరోజుల్లో వినోదాత్మకం కాని చిత్రం డబ్బుచేసుకోవడం కల్ల. కనుక ఇప్పుడు సినిమాలకు సంస్కరణలు చేయడం ముఖ్యోద్దేశం కానక్కరలేదు. అప్పటికీ అటు వంటి సినిమాలు కొన్ని మన నిర్మాతలు నిర్మిస్తున్నారు; సంతోషం! పోగా ఈ రోజుల్లో తగినంత వినోదాన్నందిస్తూ, ఏదో యథాశక్తి ప్రజలకు రుచి కరంగాకూడా ఉండాలంటూ నిత్యజీవితాన్ని ప్రతి బింబించే సాంఘిక చిత్రాలు నిర్మించడమే మార్గం. మంచిదైన కథ, మాటలు పుష్కలంగా ఉంటే అవికూడ హిట్టు అవడంకూడా కద్దు.

సంభాషణలస్థాయితో మన రంగంలో పెద్దతేడాలు కన్పడటంలేదు. కాని అక్కడక్కడమాత్రం అవక తవకలు జరుగుతున్నాయి ఇటువంటి విషయా లలో శ్రద్ధతీసుకోవడం అవసరం. సంభాషణల స్థాయి పెరుగకపోయినా, మన రచయితలు దిగ జారకుండా చూస్తున్నారనడం అతిశయోక్తి కాబోదు.

ఈ విధంగా మనరంగంలో, పాటలు, సంగీతం, కథ మొదలైన విషయాలలో స్థాయి కొంతవరకు దిగజారినా, నటీనటులు, నటనస్థాయి పెరిగిందని నిస్సందేహంగా చెప్పవచ్చును. మనకున్న ముఖ్య నాయకీ నాయకులు నీ ఇతర చిత్రసీమల వారికి నటన విష యంలో తీసిపోరు. పైగా మనరంగంలోగల సహాయ నటువర్గం మంచి ప్రతిభావంతమైనది బొంబాయి రంగంలోగాని, బెంగాలురంగంలోగాని, లేదనడం అతిశయోక్తి కానేరదు.

ఈ విధంగా వివిధ విభాగాలు చూసుకుంటూ పోతే తెలుగు చిత్రం స్థాయి చాలా ముఖ్యమైన భాగాలలో అనగా కథ పాటలు, సంగీతం మొదలైన వాటిలో కొంతవరకు దిగజారుతోందని చెప్ప వచ్చు. మనకు ప్రతిభావంతులైన దర్శకులు ఉన్నారు. అయినప్పటికీ మనచిత్రాలశ్రేణి ఇలా రోజురోజుకీ దిగ జారడం శోచనీయం. దీనికి కారణం ప్రేక్షకుల అభిరుచులను దర్శకనిర్మాతలు సరిగా అర్థంచేసుకోనక పోవటమే అనవచ్చు. కాని ప్రేక్షకులు తెలుగుదనం నిండివున్న స్వచ్ఛమైన చిత్రాలను ఎంత ఆదరి స్తారో తెలుస్తుంది ఈ నాటి చిత్రాలలోనున్న లోపాలకు ప్రేక్షకుల అభిరుచులు మారడమే కారణ మనుట న్యాయంకాదు బలమైన ఇతివృత్తం తెర కెక్కించి చక్కటి సంభాషణలు, సంగీతం చేకూర్చి క్రొత్త పంథాలో చిత్రాలను నిర్మిస్తే, అవితప్పక విజయవంతమవుతాయని నిర్మాతలు గ్రహించాలి. క్రొత్తవారికి అవకాశం ఇవ్వటంద్వారా క్రొత్త చిత్రాలు క్రొత్త పంథాలో తీసే అవకాశముంది.

ఈ మధ్య తయారవుతున్న మనచిత్రా లన్నిటి లోను కొన్ని లోపాలు కన్పిస్తున్నాయి. అసహజ మైన సన్నివేశాలను సృష్టించడం తగ్గించాలి. అవి లేకపోతే సినిమాకు వచ్చిన నష్టమేమిటో తెలి యదు! కనుక మన నిర్మాతలు, ఇకముందైనా నూత్నమైన, విభిన్నమైన ఇతివృత్తాలతో, నవీన పోకడలతో, నవీన దృక్పథాలతో చిత్రాలని నిర్మిస్తా రని ఆశిద్దాం. ★

# నేటి మన సినిమాలు

31-వ పేజీ తరువాయి

సాంకేతికంగా మన చిత్రాలు 'బాగానే' ఉంటా యని కొందరంటారుకాని, ఒక్క విదేశ చిత్రం చూస్తే ఇదెంత నిజమో తెలిసిపోతుంది దుస్తులు, సెట్టింగులు; ఏవీ సహజంగా ఉండవు. మన నటీనటుల మాట: రంభలవంటి ఆడ వారు, నలకూబరులవంటి మగవారు తెరమీద కని పించాలని ఎవరూ ఆశపడరుకాని, కనీసం నిత్యజీవి తంలో కనిపించే మనుష్యుల పోలికైనా ఉండా లి.

'మంచి' సినిమాలు తీస్తే వ్యాపారదృష్ట్యా దెబ్బతింటా యంటారు. మంచి సినిమా అనేది తీస్తేగదా ఈ విషయం తెలిసేది? పోనీ, అంతగా అయితే కొన్ని మంచివైనా తీయవచ్చుగదా? మామూలు వాటితోబాటు (కళకోసం ఏదో 'సృష్టి' చెయ్యాలని కొందరంటారు ఇది అర్థంలేనిమాటలు. 'కళ' అనే మాటకి నిఘంటువులో అర్థం చూసి ఆమైన పనికి పూనుకోవాలన్నట్లుంటుంది!) ఒక చిన్న ఉదాహరణ ఇస్తాను పెద్ద సారస్వత విచక్షణలేని వారునైతం శ్రీ 'బాపు' చిత్రాలు చూసి ఆనంది స్తున్నారు. నిజంగా మంచి వరుకు ఇస్తే ఎవరూ తోసి వెయ్యరు.

అందరూ సత్యజిత్ రాయ్‌లాగా సినిమాలు తీయలేరు తియ్యటానికి ప్రయత్నించటం మంచిదికాదు. హాలివుడ్‌లో నిర్మించే చిత్రాల్లో నూటికి తొంభైతొమ్మిదిమంది సత్యజిత్ రాయ్ ఐసెన్‌స్టైయిన్, బెర్గ్‌మాన్ చిత్రాలతో పోల్చి చూస్తే ఎందుకూ పనికిరావు కాని ఏవో తప్ప టాంతటా వాటిని చూస్తే అసహ్యంకలిగించవు

కొంచెం చదువుకున్నవారు చూచి ఆనందించ గలిగేస్థితి తెలుగు చలనచిత్ర పరిశ్రమకి ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తూ ఇంతలో స్వభాషా భిమానం వల్ల ఇప్పటి సినిమాలు చూసే ప్రేక్ష కులు అపంఖ్యాకులని నా అభిప్రాయం. ★



## క్యూ

27-వ పేజీ తరువాయి

క్యూలో నుంచున్న జనం, అది కాస్తా వచ్చేసరికి గబగబా యెగబడతారు. రెండు నిముషాల్లో కండక్టరు 'ఖహ జాగా శే దంటాడు.' ఆ 'ఖహ' అన్న పదం అర్థంకావడంకోసం వాగ్యుద్ధం బయలు దేరుతుంది. 'నేను మాత్రం బస్సు యెక్కపోయేను. కాదా? వాతరవాత యింక జాగా లేదంటాడు ఫుట్ బోర్డు మీద వేలాడుతూన్న ఓ పెద్దమనిషి. ఫుట్ బోర్డు మీదనుంచి నువ్వు దిగితేనేకాని బస్సు కదలదని శపిస్తాడు కండక్టరు. దాంతో కేకాకేకి ముష్టి ముష్టిన్నీ. ఈదో తరఫీలో ఎక్కడో నలుగురి వెనుకనున్న ఓ భీముడి అవతారం దూసుకుంటూవచ్చి, ఆడవాళ్ళనీ అర్భకుల్నీ అటూయిటూ తోసేసి బస్సులోకిదూకి, చెట్టుమీద తొండలాగా మరి పోల్చుకో లేకుండా లోపల నుంచున్నవాళ్ళలో కలిసి పోతాడు.

"అతన్ని యెలాగ ఎక్కనిచ్చావ్?" అంటూ రభస ఉద్ధృతం చేస్తాడు ఫుట్ బోర్డు మీద అల్లాడి పడుతున్న వ్యక్తి.

"దిగవయ్యా" అంటూ బస్సులోపల నుంచున్న వాళ్ళల్లో చివరివాడి కోటుపట్టుకు గుంజుతాడు కండక్టరు.

"నేనా దొరికేను నీకు? ఏళ్ళనుంచి బస్సులో ప్రయాణం చేస్తూ ఉంటేను! ఇదిగో నా టిక్కెట్టు మళ్ళీ మాట్లాడేవంటే......నీకేం కర్మ—" ప్రతి మించ బెక్కేస్తా డాయన.

"ఏం నయినా సరే, ఫుట్ బోర్డు మీద మనిషి ఉంటే బస్సు కదలదు"

కండక్టరు భీష్మించుకుపోతాడు.

కాస్సేపు కసాలాపడి, ఫుట్ బోర్డు మీద వ్యక్తి దిగిపోతాడు.

బస్సు గంట మోగుతుంది.

అది కదులుతూ ఉంటే కోతిలా గెంతుతాడు ఫుట్ బోర్డు మీదికి, యిందాకటి వ్యక్తి. కథ మొదటికి వస్తుంది.

బస్సు పదిమాట్లు కదులుతుంది.

పదిసార్లు వ్యక్తి ఫుట్ బోర్డు మీదికి లంఘిస్తాడు.

బస్సు పదిమాట్లు ఆగుతుంది.

ఆఫీసుకి టయిము అయిపోతూన్నా సరే, బస్సులో ఉన్న తగుమనుషులు యెవ్వర్నీ యేమాటా అనరు! ☆

# భూగర్భంలోనికి సాహసయాత్ర

24-వ పేజీ తరువాయి

ఈ సంఘటన శాస్త్రజ్ఞులలో పెద్ద అలజడికి కారణం అయినది. మిల్న్—ఎడ్వర్డ్స్, కాత్‌ర్‌ఫాజి ఆ బొమికి ముక్కని అనుశీలించి అది నిజంగా మనిషి చివ్వకమేనని చెప్పారు. వీరిని 'చివ్వకవాదు' లనేవారు.

బ్రిటన్‌లో ఫాలకనర్, బస్క్, కార్పెంటర్ మొదలయినవారు, జర్మనీలో మా పెదనాన్న లిడెన్‌బ్రోక్ తోసహా మరికొందరు వీరివాదాన్ని బలపరిచారు.

అంటే ఆ ఎముక ముక్క 'నాలుగవ యుగాని'కి చెందిన నిజమైన 'ఫాసిల్' అనటానికి ఖండించ లేని సాక్ష్యం దొరికింది అన్నమాట. (నాలుగవ యుగం— Quaternary Age )

కాని ఈవర్గంవారికి దీర్ఘశత్రువు ఒకడు ఉన్నాడు. ఈయనే శ్రీ ఎలీదబోమా అనే గొప్ప పండితుడు. ఈ ఎముకముక్క తక్కినవారు చెప్పినంత ప్రాచీనమయినదికాదని ఈయన వూహ. ఈయనవైపు వాదించిన వారు చాలా కొద్దిమంది.

సమస్య గురించి ఇంత తెలుసు: మేము బయలు దేరిన తర్వాత పరిశ్రొత్త నిదర్శనలు కొన్ని దొరికాయని మాకు తెలియదు. వీటినిబట్టి 'నాలుగవ యుగం'లో మానవజాతి ఉండేదనే వాదం ప్రబలమవుతున్నది.

ఇంతేకాదు. 'ప్లియోసీన్' దశకు చెందిన 'ఫాసిల్' కొన్నిటినిబట్టి మానవజాతి అనుకున్నదానికంటే పురాతనమయినదని చెప్పే అవకాశం ఉన్నదని కొందరు శాస్త్రజ్ఞులు (సాహసంచేసి) ప్రతిపాదించారు.

అనగా మానవుడు లక్ష సంవత్సరాలుపైగా భూమిమీద ఉన్నాడని చెప్పవచ్చు!

మా పెదనాన్న మరి ఇరవై అడుగులు ముందుకు వేశాడో లేదో ఆయనకు ఆశ్చర్యం, ఆనందం కలిగించే 'వస్తువు' ఒకటి తటస్థం అయినది.

అదొక శవం అని స్పష్టంగా తెలుస్తున్నది. ఇక్కడి నేలవల్లనే నశించి పోకుండా ఇన్ని సంవత్సరాలు ఈ విధంగానే ఉండిపోయివడా అనుకున్నాను. ఈ ప్రశ్నకు జవాబు నాకు తెలియదు. కాని ఎండిన చర్మంతో, కదలుతాయి అనిపించే కాలు, చేతులతో, ఇంకా పడిపోని పళ్ళతో, జుట్టుతో, వేళ్ళ నఖాలతో ఈ కళేబరం ప్రాణంతో ఉన్నప్పుడు ఎటువంటి మనిషిదో తెలుస్తూనే ఉన్నది.

మరొక యుగంనుంచి వచ్చిన ఈ ప్రేతం ముందు నోట మాటరాక మంచువిఉండిపోయాము. వాచాలుడయిన మా పెదనాన్న కూడా మౌనంగా ఉండిపోయాడు. శవాన్నిఎత్తి, ఒక రాతికిఆన్చి నుంచోపెట్టాము. గుడ్లులేని కళ్ళు మా వైపు చూస్తున్నాయి. రొమ్ముమీద తట్టగా, లోపల డొల్ల సూచించే శబ్దం వినిపించినది.

కొన్ని క్షణాలు మాటలు రాకపోయినా, మా పెదనాన్నని ప్రొఫెసర్‌గారు జయించాడు. ఓట్టో లిడెన్‌బ్రోక్ తను ఎక్కడ ఉన్నాడో మర్చిపోయాడు. ఆయన స్వభావమే అంత. మమ్మల్ని ముంచివేసిన ఆ పెద్ద గుహ, మా యాత్ర, వీటి సంగతి మర్చిపోయాడు. సెయింట్‌జాన్‌స్ కాలేజిలో విద్యార్థులకు ఉపన్యాసం ఇస్తున్నాననుకున్నాడేమో! ఉపన్యాస ధోరణిలో ఇలా ప్రారంభించాడు.

"అయ్యా! నాలుగవ దశకు చెందిన మానవుడిని మీకు పరిచయంచేసే గౌరవం నాకు దక్కింది.

కొందరు పండితులు ఇతను అసలు లేనే లేడన్నారు. వీరికేమాత్రం తీసిపోని ఇతర పండితులు ఉన్నాడన్నారు. నమ్మకంలేనివారంతా ఈవేళ ఇక్కడే కనకఉంటే ఇతన్ని స్వహస్తాలతో ముట్టుకుని చూసి, తమ పొరపాటు తెలుసుకుంటారు. ఇంతకు ముందు మోసాలుకొన్ని జరిగాయని నాకు తెలుసు! కొందరు పామరులు శాస్త్రానికి సంబంధించిన విషయాలలో కల్పించుకుని లాభం చేసుకుందామని ప్రయత్నించారు. రాక్షసుల అస్థిపంజరాలను కున్నవి చాలా ఉన్నాయని నాకూ తెలుసు! 'లుసర్న్' వద్ద దొరికిన రాక్షసి ఎముకల సంగతి మనందరకీ తెలుసు! నా స్వహస్తాలతో రా—"

"వయసులో ఉండగా నేను పది పులుల్ని చంపాను తెలుసా?" ఒకవృద్ధుడు తన మనుమడికి చెబుతున్నాడు.

"ఇదివర కెప్పుడో ఐదుపులుల్నే చంపానన్నావ్?" పొగరుబోతు మనుమడు ఎదురుప్రశ్న వేశాడు.

"నువ్వు కుర్రాడివి కదూ భయపడుతావని అప్పుడు ఐదనే చెప్పానులే" తాత తేలికగా సమాధానం చెప్పాడు.

బి. హరినారాయణ (బందరు)

ఇక్కడ మా పెదనాన్న నోటినుంచి మాట పెగలలేదు. బహిరంగ ప్రదేశాలలో పెద్దమాటలు ఉచ్చరించాలంటే ఆయన కష్టపడ్డారు.

"నా స్వహస్తాలలో పట్టుకున్న పుస్తకం పేరురా—" అన్నాడు. అంతకుమించి అనలేకపోయాడు.

"రాక్ష—"

అసాధ్యం! ఈ దిక్కుమాలినమాట పెగలదు. సెయింట్ జాన్‌స్‌లో ఈపాటికి విరగబడి నవ్వేవారు!

"రాక్షసశల్య శాస్త్రం!" రెండు తిట్లమధ్య సాధించాడు మాపెదనాన్న.

ఆ తర్వాత సులభంగానే చెప్పుకుపోయాడు. ఉత్సాహం ఎక్కువ అయినకొద్దీ.

"అవును! ఈ విషయాలన్నీ నాకు తెలును. కూవియర్, బ్లూమెన్‌బాక్‌లు ఈ ఎముకలు నాలుగవ యుగానికి చెందిన రాక్షసి ఏనుగులవి మాత్రమే నన్నారు. కాని, ఈ సాక్ష్యంతో సందేహాలన్నీ తీరిపోవాలి! ఇంకా సందేహించటం శాస్త్రానికే అవమానం! ఇది అస్థిపంజరంకాదు. భద్రంగా చెడిపోకుండా ఉండిపోయినశవం. మానవ శాస్త్రానికి చాలా ఉపయోగపడుతుంది!"

"గంధ కామ్లంలో ఒకసారి కడిగితే" అన్నాడు మా పెదనాన్న తన స్వంతధోరణిలో, "పైన పేరుకునిఉన్న మట్టిపోతుంది. కానిఆ అమూల్య ద్రావకం మన కిక్కడ దొరకదు. అయినా ఈ స్థితిలోనే ఈ కళేబరం తన విషయం చాలావరకు చెప్పుకుంటుంది."

ఆ ఫాసిల్ శవాన్ని పట్టుకుని మా పెదనాన్న ఇటూ అటూ జరిపాడు.

"ఆరడుల పొడుగుకి తక్కువే ఉన్నాడని మీరే చూడగలుగుతున్నారు. ప్రాచీనకాలంలో రాక్షసులుండేవారంటారు గాని వారి విషయం వేరు! ఇతను మన జాతి, శ్వేత జాతి! ఈ జాతివారు ఒకప్పుడు పశ్చిమ యూరోప్‌నుంచి ఇండీస్‌వరకూ ఉండేవారని సాహసించి చెప్పగలను! ఈ జాతి 'జాఫెటిక్' (Japhetic) జాతి అని కూడా చెప్తారు. నవ్వకండి."

ఎవరూ నవ్వటంలేదు — కాని ఉపన్యాసాలలో ముఖాలు మారటం చూసే అలవాటు ప్రొఫెసర్ గారిచేత ఇలా మాట్లాడేట్లు చేస్తున్నది!

"అవును" అన్నాడు క్రొత్త ఉత్సాహంతో. "ఇతనొక ఫాసిల్ మానవుడు ఈ రాక్షస మృగాల సమకాలికుడు. కాని, ఇక్కడికి ఏ మార్గం అనుసరించి వచ్చాడో చెప్పలేను ఈ భూగర్భ గుహలోనికి ఎలా చేరుకున్నాడో తెలీదు నాలుగవ యుగంలో పెద్ద భూకంపాలువచ్చి, పై పెచ్చుమీద చీలికలు ఏర్పడి, పైన భూభాగాలు కొన్ని లోపలికి జారిపడిపోయిఉంటాయి. నావరకు పరిశోధనకు రాలేదు కనుక అసలయిన ప్రాచీన మానవుడేనని సందేహం లేకుండా చెప్పగలను!"

ప్రొఫెసర్‌గారు ప్రసంగం ముగించారు. మేము నిశగ్రీవంగా ప్రశంసించాము. మా పెదనాన్న చెప్పినదంతా నిజం. ఆయన తమ్ముడి కొడుకును మించిన శాస్త్రజ్ఞులు కూడా ఆయన వాదనలు ఖండించలేకపోయేవారు.

మరికొంత సాక్ష్యం దొరికినది. ముందుకు నడిచిపోయినకొద్దీ, ఇంకా కొన్ని 'ఫాసిల్' శవాలు దొరికాయి.

నిజంగా అద్భుతమయిన దృశ్యం; కొన్ని రకాల జంతువులూ, మానవులూ, అన్మశానంలో కలిసిపోయిఉండటం. కాని నాకు ఒక సందేహం కలిగినది. ఇది నన్ను కలత పెట్టినది. ఆ సందేహ నివృత్తికి సాహసించలేకపోయాను. ఒక ప్రాచీన భూకంపంలో అప్పుడు సజీవంగాఉన్న ఈ మానవులు భూగర్భ కుహరాలలోనికిపడి మరణించారా, లేక అసలు ఇక్కడే ఈ పాతాళలోకంలో, ఈ కృత్రిమాకాశం క్రింద పైలోకం వారివలెనే జన్మిస్తూ, మరణిస్తూ ఉండేవారా? ఇంతదాకా మేము చూడగలిగినవి చేపలు, సముద్ర మృగాలు మాత్రమే. పాతాళలోక నివాసులు ఇక్కడ ఇంకా తిరుగుతూ ఉన్నారా?

* * *

# 39

వసిలా అడుగుటెప్పు ఎముకలమీద నడిచి వెళ్లాము. పైన ఏమిఉన్నదో తెలుసుకోవాలనే కుతూహలం పట్టలేక ముందుకి సాగిపోయాము. ఈ పెద్ద గుహలో వేరే అద్భుతాలు ఏమి ఉన్నాయి? ఏ వైపరిత్యం వచ్చినా ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉన్నాను. నా ఊహాలు ఎంత ఆశ్చర్యకరమయిన వైచిత్ర్యానికయినా సిద్ధంగా ఉన్నాయి.

ఈ ఎముకలగుట్టల వెనుక సముద్రం కని పించటం మానివేసినది. దేనికయినా తెగించిన ప్రొఫె సర్‌గారు, దారి ఎక్కడ తప్పిపోతానో అనే భయంచేత కావచ్చు, నన్ను తొందరపెట్టి తీసుకుపోయాడు. మాటలు లేకుండా మా చుట్టూఉన్న విద్యుచ్ఛక్తి కాంతిలో 'స్నానం' చేస్తూ వెళ్లాము. ఎందువల్లనో చెప్పలేనుకాని, వెలుగు ప్రతి వస్తువుకీ అన్ని వైపులా పడేది. అన్ని దిక్కులనుంచి ప్రసారమవుతున్నదేమో నీడలుపడే అవకాశమే లేకపోయినది. భూమధ్యరేఖ సమీప ప్రదేశాలలో మిట్టమధ్యాహ్నపు సూర్య రశ్మిలో ఉన్నట్లున్నది. ఆవిరి కనిపించడములేదు. రాళ్లగుట్టలు, దూరాన కొండలు, అక్కడక్కడ చెట్లగుంపులు ఈ వింతకాంతి ప్రసారంలో కంటికి విచిత్రంగా అగుపిస్తున్నాయి. హాఫ్‌మాన్ (Hoffman ఒక జర్మన్ రచయిత) సృష్టించిన నీడలేని మనిషివలె ఉన్నాము.

ఒక మైలు దూరం నడిచిన తర్వాత పెద్ద అరణ్యం అంచులు చేరుకున్నాము, కాని గ్రొబెన్ నౌకాశ్రయం వద్ద చూసిన కుక్కగొడుగుల అడవివంటిదికాదు.

'మూడవయుగం' (Tertiary period భూగోళ చరిత్రలో) వృక్ష సంపద ఇక్కడ నిండుగా కనిపిస్తున్నది. కొబ్బరిచెట్ల జాతికి చెందిన వృక్షాలు చాలా ఎత్తయినవి; ఇంకా ఎన్నో రకాల చెట్లు తీగలు చుట్టుకుని ఉండటం చూశాము. నేలమీద 'నాచు' పుష్కలంగా ఎదిగి తివాసీ పరచినట్లు ఉన్నది. తళతళ మని మెరుస్తున్న సెలయేర్లు వృక్షాలక్రింద పారు తున్నాయికాని, వాటిమీద చెట్లనీడలు పడటంలేదు. వాటి తీరాలమీద భూగోళంపైన కృత్రిమంగా పెంచేసిన మందిరాలలో ఎదిగే వృక్షవిశేషాలు చూశాము. ఈ చెట్లు అన్నిటిలోనూ ఒక విశేషం తెలుస్తున్నది; ఒక్కదానికీ పచ్చదనం అసలు లేనే లేదు. సూర్యరశ్మి లేదుకనుక ఇది ఆశ్చర్యం కలిగించే విషయం కాదు. అన్నీ బూడిద లేక ఎండిపోయిన ఆకుల రంగు కలిగి ఉన్నాయి. ఎక్కడా పచ్చని ఆకులేదు. పువ్వులుకూడా — వీటికి కొదువలేదు—వాసన, రంగులేని కాగితం పువ్వులవలె ఉన్నాయి.

ఈ పెద్ద తోపు లోపలికి నడిచాడు మా పెద నాన్న. భయపడుతూనే ఆయనవెంట వెళ్లాము. వృక్షసంపద ఇంత ఉన్నప్పుడు వాటిని నెమరువేసే రాక్షసజంతువులు ఎందుకు ఉండరాదు? స్తన్య మృగాలకు సరిపోయే చెట్లు నాకు చాలా కనిపిం చాయి. భూగోళంమీద దూరదూరంగాఉండే దేశా లలో ఎదిగే వృక్షాలు కొన్ని చూశాను; ఆస్ట్రేలి యాకి చెందిన 'యూకలిప్టస్' మీదకు నార్వేదేశపు పైన్ (Pine) వృక్షం వంగిఉన్నది. ఉత్తరధృవం వైపు పెరిగే బిర్చ్ (Birch) న్యూజిలాండ్ దేశపు కౌరి (Kauri) మధ్య కలిసిపోయి ఉన్నది.

# భూగర్భంలోనికి సాహసయాత్ర

వృక్షశాస్త్రంలో ఆరితేరినవారు పైతం తికమకపడి పోయేవారు.

హఠాత్తుగా ఆగిపోయాము. మా పెదనాన్నను వెనుకకు లాగాను.

దూరంలో దట్టంగా పెరిగిఉన్న కొన్ని పొదల మధ్య ఏదో వస్తువు ఆవెలుగులో నాకు కనిపించి నది. ఏదో చూశాను అనుకున్నాను—కాదు! నా కళ్ల తోనే మహాస్వరూపాలు కదలటం చూశాను. అవి రాక్షస మృగాలు; రాక్షస మత్తేభాల గుంపు—'ఫాసిల్' లు కావు. ఓహాయో (Ohio-అమెరికా)లో 1801లో దొరికిన అస్తికలు ఏ జంతువులకు చెందినవో అటు వంటివి. ఈ రాక్షస మత్తేభాల తొండాలు చెట్ల చుట్టూ నేలను పెరికివేస్తూ ఉంటే, సర్ప సమూ హం ఏదో చూపినట్లు ఉన్నది. కుళ్లిపోయిన చెట్ల మొదళ్లలోనికి వీటి దంతాలు దిగుతూ చేసిన శబ్దాలు

---

మర్నాడు నిద్ర లేవగానే తామంతా లక్షాధికార్లు అయి నట్లు తెలిస్తే, ఏమిచెయ్యాదలచిందీ చెప్పుకుంటూ ముగ్గురు మిత్రులు మురిసిపోతున్నారు.

"నేను వెంటనే ఒకపెద్దభవనం కట్టిస్తా" ఒకడు అన్నాడు.

"నేను బొంబాయివెళ్ళి సరదాగా కొంతకాలం తిరిగివస్తా" రెండవవాడు తనకోరిక చెప్పే శాడు.

"మళ్ళీ నిద్రపోతే ఇంకోలక్ష వస్తుందేమో ఎదురు చూస్తా" మూడవవాడు తాపీగా బయట పెట్టాడు.

డి. ముకుందం (విజయవాడ)

---

విన్నాను. కొమ్మలు విరిగిపోయాయి. బళ్ళు నింపేం దుకు సరిపోయే ఆకు ఈ పెద్ద మృగాల గొంతుకల సొరంగాలలోకి మాయమవుతున్నది.

చరిత్రకుపూర్వం మూడవయుగంలో ప్రపంచం ఏవిధంగా ఉండేదో చూడాలని కలలు కన్నాను. అవి ఇప్పుడు నిజం అయ్యాయి. భూగర్భంలో ఈ భయంకరమైన జంతువులమధ్య మేము ఒంటరిగా ఉన్నాము!

మా పెదనాన్న తీవ్రంగా, కుతూహలంతో, ఆసక్తితో చూస్తున్నాడు.

"పద" అన్నాడు నా రెక్క పట్టుకుని. "ముందుకి పద! ముందుకి పద!"

"వెళ్ళను!" అని అరిచాను. "మనకు తుపా కులు లేవు. ఈ నాలుగుకాళ్ల రాక్షసులమధ్య మనం చెయ్యగలిగిన దేమున్నది? పద్దెనిమిదే పెదనాన్నా— లేదా ఈ జంతువుల కోపానికి ఏ మని తప్పుకోక లేదు!"

"ఏ మనిషీ తప్పుకోలేదా?" అని మా పెద నాన్న గొంతుక తగ్గించి, సమాధానం ఇచ్చాడు. "పొర బడ్డావు ఆక్సెల్. అదుగో ఆ కింద చూడు! మన వంటి ప్రాణి ఒకటి కనిపిస్తొందనుకుంటున్నాను: మనిషి!"

అపనమ్మకంతో, తలఅడ్డంగాఆడిస్తూ, చూశాను. ముందు నమ్మకపోయినా, నా జ్ఞానేంద్రియాల సాక్ష్యాన్ని కాదనలేకపోయాను.

నిజానికి, పావుమైలు దూరంలో, ఒక పెద్ద కౌరి వృక్షానికి ఆనుకుని, ఒక మానవుడు నుంచుని ఉన్నాడు. ఈ రాక్షసి ఏనుగులమందను కాస్తు న్నట్లు ఉన్నాడు. నెప్ట్యూన్ (నీటి దేవత) పుత్రు లలో ఒకడా అనిపించినది.

"రాక్షసి మందల కాపరి, వాటిని మించినవాడు" అని అర్థంవచ్చే ఒక లాటిన్ పద్యంలో చరణం గుర్తుకు వచ్చింది.

అవును. వాటిని మించినవాడే, అనిపించేట్లు ఉన్నాడు. మేము అంతకుముందు ఎముకలమధ్య లేలికగా, ఎత్తైన ఫాసిల్ మనిషివంటివాడుకాదు. ఈ మహా మృగాలను అణచివేయగలిగిన రాక్షసుడు. కనీసం పన్నెండు అడుగుల ఎత్తు ఉంటాడు. దున్న పోతు తలవలె వికారంగాఉన్న తల చింపిరిజుట్టు క్రింద సరిగ్గా కనిపించటంలేదు. ప్రాచీనకాలం ఏనుగులకు తలవద్ద జూలు ఉంటుంది. ఇతని జుట్టు అలాగే ఉన్నది. చేతిలో ఒక పెద్ద కొమ్మ పట్టుకుని ఉన్నాడు. ఇది అతని చేతికి తగిన దండమే అనిపించినది.

సంభ్రమంతో నోటమాటరాక నుంచుని ఉండి పోయాము. కాని మమ్మల్నిచూస్తాడేమో! పారిపోవాలి!

"రా, వచ్చేసెయ్!" అన్నాను మా పెదనాన్నతో. ఈసారి మాత్రం చెప్పినమాట విన్నాడు.

పావుగంటలో ఈ భయంకర రాక్షసుడి చేతికి చిక్కనంతదూరానికి పారిపోయాము.

అయినా— ఇప్పటికీ, నా మనస్సు కుదుట పడిన తర్వాత, ఈ సంఘటన జరిగి, నెలలు గడిచిన తర్వాత నేను అసలు ఏమనుకోవాలి? ఏది నమ్మాలి?

మాకళ్ళు మమ్మల్ని మోసంచేసి ఉండటానికి వీలులేదు. కాని చూసినది మిథ్య అనిపిస్తున్నది కూడా. ఈ పాతాళలోకంలో మానవులు లేరు. ఈ భూగర్భ కుహరంలో నర సంచారంలేదు. పైన లోకంలో వారికి తెలియకుండా వీరు అసలు ఎలా ఉన్నారు? నమ్మ టానికి వీలులేదు.

మానవాకారంకల మృగం ఏదైనా అయిఉండాలి, కాని పరిమాణాలు మరీ పెద్దవిగా ఉన్నాయి! వీటిని సూచించే 'ఫాసిల్'లు దొరకనేలేదు. సజీవంగాఉన్న మానవుడు భూగర్భాంతరాళాలలో ఇంకా సంచరిం చటం అసాధ్యం.

ఎలాగైతేనేమి వెలుగుతోనిండిన ఈ అడవిని వదలి వెళ్ళిపోయాము. భయంతో బిగుసుకు పోయాము. ఈ రాక్షసుడు మా వెంట వస్తున్నా డేమోనని పరుగు తీశాము. పీడ కలలోవచ్చే పతనం, ఈడ్పు ఇలాగే ఉంటాయి. అనాలోచితంగా లిడెన్ బ్రోక్ సముద్రం చేరుకున్నాము. అప్పుడే కనుక ఒక

నిశ్చ మనుష్య విముఠ్నాటిక పోయినట్లయితే నా భావన ఏ పరిణామాలకు దారితీసేదో చెప్పలేను.

ఇంతకుముందు మేము నడిచిన నేలకులేదు ఇప్పటిది కాని, గ్రానైట్ సొరంగమార్గంవద్ద చూసి నటువంటి శిలా విశేషాలు కనిపిస్తున్నాయి. దిక్సూచి ముల్లు కూడా ఈ స్థాన బలపరుస్తున్నది— అంటే మాకు తెలియకుండా లిడెన్‌బ్రోక్ సముద్రం ఉత్తరతీరం చేరుకున్నామన్నమాట. సమ్మోదుకు పిలుగానే ఉన్నది. సెలయేర్లు, జలపాతాలు రాళ్ళ మధ్య కావలసినన్ని కనిపిస్తూనే ఉన్నాయి. మా 'హన్స్‌బాక్' గుర్తు పట్టగలిగాననుకున్నాను. నేను స్పృహ కోల్పోయిన తర్వాత మేలుకున్న గుహ తిరిగి చూస్తున్నాననుకున్నాను. కాని అపరిచితమయిన శిలా నిర్మాణం ఏదయినా కనిపించినప్పుడు సందేహం కలుగుతూ ఉండేది.

నాశంక మా పెదనాన్నతో చెప్పాను. నా వలెనే సందేహించాడు. ఈ పరిసరాలలో పెద విశేషం ఏదీ గుర్తు పట్టలేకపోయాడు.

"మనం బయలుదేరిన చోటకే తిరిగి వచ్చి ఉండక పోవచ్చు. తీరం వెంబడే వెడితే గ్రాబెన్ సొరంగమార్గం తగలకపోదు" అన్నాను.

"అయితే మన పరిశోధన ఆపి, తెప్పవద్దకు తిరిగి పోదాం. కాని, ఆక్సెల్ నువ్వు పొరబడటంలేదు కదా?"

"గట్టిగా చెప్పలేం, పెదనాన్నా. ఈ రాళ్ళన్నీ ఒక విధంగానే ఉన్నాయి. అయినప్పటికీ హాన్స్ తెప్ప నిర్మించినది ఆ రాతిగుట్ట దగ్గరకదూ? పోనీ ఇది సొరంగమార్గం కాకపోయినా, మనం దాని సమీపంలోనే ఉండిఉంటాం!" అని నేను ఆ ప్రదేశం జాగ్రత్తగా పరిశీలించి చూశాను. ఇంతకు మునుపు చూసినట్లే ఉన్నది.

"కాదు ఆక్సెల్, మనం ఇటు ప్రయాణం చేసిన జాడలయినా కనిపించాలికదా? ఏదీ......"

"ఇదిగో" అని ఇసుకమీద వస్తువుని ఒకదాని వైపు చూపుతూ అరిచాను.

అదొక తుప్పుపట్టిన బాకు. మా పెదనాన్నకు చూపించాను.

"పరిశీలో" అన్నాడు ఆయన, "ఈ ఆయుధం నీ దగ్గర ఉండేదా?"

"నా దగ్గరా! లేదే! కాని నువ్వు.....

"నాకు తెలిసినంతమట్టుకు ఈ వస్తువు నాది కాదు" అన్నాడు ప్రొఫెసర్‌గారు.

"వింతగాఉందే!"

"కాదు ఆక్సెల్. అయిస్‌లాండర్లవద్ద ఇటువంటి ఆయుధాలు ఉంటాయి. హాన్స్ కత్తి అయి ఉంటుంది. పోగొట్టుకుని ఉంటాడు."

తల అడ్డంగా ఆడించాను. హాన్స్‌వద్ద ఇటువంటి వస్తువు లేనేలేదు.

"మనం చూసిన రాక్షసుని సమకాలికుడయిన మనిషిదెవరిదయినానేమో!" అని అరిచాను.

"కాదు. పిచ్చోడు. ఇది 'రాతి యుగాని'కి చెందింది కాదు. ఇనుము కూడా కాదు. ఉక్కుతో చేసినది...."

మా పెదనాన్న నా ఉపన్యాసం ఆగేట్టులేదని మాటకు అడ్డు వచ్చాడు.

"కంగారుపడకు ఆక్సెల్. ఆలోచించిచూడు. ఇది పదహారవ శతాబ్దపు బాకు. అప్పటికాలం పెద్ద మనుష్యులు వాటిని నడుంచుట్టూ ఉన్న 'బెల్టు'లో దోపుకునేవారు. ఇది స్పెయిన్ దేశంనుంచి వచ్చింది. ఇది నాదీకాదు. నీదీకాదు. మనవేటగానిదీకాదు. ఈ లోకంలో నివసించేవారి దెవరిదీకాదు. మనుష్యుల గొంతుకలుకోసి, ఇలా రంపంలాగ తయారలేదు. దీనికి పట్టిన తుప్పు ఈనాటిదికాదు. సంవత్సరం—వంద సంవత్సరాలకుమించినది"

ప్రొఫెసర్‌గారి ఆవేశం అధికం అవుతున్నది. ఇష్టం వచ్చినట్లు ఊహించి పారవేస్తున్నాడు.

"ఆక్సెల్ మన మొక మహోత్తర విషయం కను క్కోబోతున్నాం. ఈ బాకు ఇక్కడ మూడు వందల ఏళ్లకుపైగా పడిఉంది. ఈ సముద్రం అందుల చుట్టూ ఉన్న రాళ్ళకు తగిలి మొక్కపోయింది!"

"కాని, దానంతట అదే వచ్చిందా? ఇలా వంకర పోవటానికి కారణం ఏమిటి? మనకుముందే ఎవరో వచ్చారు!"

"అవును—ఒక మానవు డెవరో వచ్చాడు!"

"అత నెవరై ఉంటాడు?"

"ఈ బాకుతోనే ఎక్కడో తనపేరు చెక్కిన మానవుడు. భూగర్భ కేంద్రానికి దారి చూపేందుకు గుర్తులు పెట్టిన మానవుడు. చుట్టూ వెతికి చూద్దాం. చూడు!"

విచిత్రమయిన కుతుకంతో అంతా వెతికి చూశాము. చుట్టూఉన్న 'గోడ' మీదా, పగుళ్ళలో, అన్ని చోట్లా వెతికాము.

చివరకు తీరం వెడల్పు తక్కువగాఉన్న ఒక ప్రదేశానికి వచ్చాము. సముద్రం అలలు ఇక్కడ రాళ్ల దడియలకు వచ్చి తగులుతున్నాయి. నడిచే దారి వెడల్పు రెండు గజాలకు మించిలేదు. రెండు రాళ్లమధ్య సొరంగం యొక్క ద్వారం కనిపించి నది.

అక్కడ, ఒక గ్రానైట్ ఫలకలమీద రెండు అక్షరాలు చెక్కిఉన్నాయి. కాలగమనంవల్ల సగం తిని వేసిఉన్నాయి. అవే ఒక సాహస యాత్రికుని పేరు సూచించే అక్షరాలు.

"ఏ. ఎస్." అని అరిచాడు మా పెదనాన్న. "ఆర్నిసాక్నుస్సెమ్! ఎక్కడా చూసినా ఆర్నెసాక్నుస్సెమ్!"

(సశేషం)

# ధ్యేయం

24వ పేజీ తరువాయి

లోతున్నారు." అన్నాడా తాయరు కుడి అరచేతిలో ఎడంచెయ్యి గుప్పిటను ఉంచుతూ.

"పేసు—దొరికితే—నేలమీద—లేకపోతే మేడమీద అన్నాడు ధర్మారావు వినుగ్గా.

"వోవో — అదికాదు — పాయింటు కావాలి" అంటూ ఆతనూ లేచాడు.

"పాయింటూ—ఇదిగో — వారంటు" అన్నాడు ధర్మారావు దాన్ని చూపిస్తూ. తర్వాత, "రెండు క్షణాల్లో రాకపోతే వెతికి అరెస్టు చెయ్యాల్సి వుంటుం"దని ప్రకటించాడు.

మేడమీద—రామారావు పిస్టలు పట్టుకుని వికృతంగా నవ్వుతూ, "అయ్! అరెస్టుచెయ్యండి— మీ ఇద్దర్నీ చంపి, నేను మరీ చస్తాను" అంటూ అరిచాడు. శంకర్ ఉత్సాహంగా మెట్లకేసి పరిగెత్తాడు. "పేలుస్తున్నా" అంటూ రామారావు హెచ్చరించి "ఢాం" అని పేల్చాడు. శంకర్ గమ్మున తలవంచి, ఒక పరుగున వంగి, అతని కాళ్ళమీద పడుతూ, కాళ్ళు ఎత్తి లాగేశాడు. ఈలోగా ధర్మారావు గమ్మున మెట్లపైవు పరుగెత్తాడు. గమ్మున కాళ్ళు దొరకపుచ్చుకుని లాగడంతో రామారావు చేతిలో పిస్టలు ఎగిరి కిందపడడమే కాకుండా, చెట్టంతమనిషి దిగ్గున వెల్లకిలా అవతలి మెట్ల వైపు పడి, పది, పదిహేను మెట్లు దొర్లాడు.

"క్యాచ్ఛిస్" అని అరుస్తూ శంకర్ ఎగిరి అటు పరిగెత్తాడు. పరిగెత్తి దొర్లలేక, ఒకమెట్టు మీదున్న రామారావుని పట్టుకున్నాడు. ధర్మారావు పిస్టలు బెల్టులో పెట్టుకుని నించున్నాడు. రామారావుని పట్టుకోబోయిన శంకరం ఉలిక్కిపడి, వెర్రిచూపులు చూశాడు.

"ప్ప్ — మెడవెనుక ఆయువుపట్టులో దెబ్బ తగిలింది — నువ్వు తొందరపడ్డావు శంకర్— అయామ్సారీ" అంటూ నేరేపనికి తెచ్చిన కంకణాలు శంకరానికి తొడిగాడు.

"నేనేం చేస్తాను సార్" అన్నాడు శంకర్ వెర్రిగా.

"ఇది—నా కర్తవ్యం శంకర్—నువ్వు చెయ్యాలని చెయ్యలేదు. బహుశా నీకేం భయంలేదు—రా" అంటూ జీపువైపు నడిచాడు.

* * *

శంకరం అరెస్టు అయిననాటి సాయంత్రం ధర్మారావు మోటారుసైకిలు ఎక్కి బయలుదేరాడు. క్రమేణా ఊరి పొలిమేర దాటి, ఇంకో ఊరు పొలిమేర చేరి, అదీ దాటి, అలాగే ఇంకో ఊరు దాటి, మరో ఊరుచేరి, మోటారుసైకిలు ఓ ఇంటిముందు ఆగింది. ఆ శబ్దానికి ఆ యింట్లో జనం లేచారు. ధర్మారావు వీధి తలుపు తోసుకుని లోపలకు ప్రవేశించాడు. పోలీసు దుస్తుల్లోవున్న అతన్ని చూస్తూనే ఇరుగుపొరుగువాళ్ళు నెమ్మదిగా జారుకున్నారు. "కూర్చోబాబూ"అంది ఒక నలభైయేళ్ళ ఆవిడ. ధర్మారావు అరుగుమీద కూర్చుంటూ, "నేను శంకరం స్నేహితుణ్ణి" అన్నాడు.

"అలాగా నాయినా— నే నప్పుడే అనుకున్నాను" అంది ఆవిడ.

"మరి—ఓ విషయం చెప్పాలని వచ్చానండీ" అన్నాడు ధర్మారావు నీళ్ళు నవులుతూ.

"చెప్పు నాయనా" అందావిడ కూర్చుంటూ.

ధర్మారావు శంకరం ఎలా అరెస్టు చెయ్యబడ్డాడో చెప్పి, అతను తప్పక విడుదల అవుతాడు అంటూ ధైర్యం చెప్పాడు.

"బాబూ, 'డ్యూటీ'—కర్తవ్యంకోసం పట్టుకోబోతే వాడు చస్తే — మా అల్లుడేం చేస్తాడు బాబూ" అంది ముసలావిడ.

"ఏభ్బే—ఏం లేదమ్మా—ఉత్తనే పట్టుకున్నాం. రేపు విచారణ జరుగుతుంది. వదిలేస్తారు. మిమ్మల్ని గాభరా పడద్దనిచెప్పడానికివచ్చా"నన్నాడు ధర్మారావు.

# ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
# మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి




కుటుంబంలో అందరి బట్టలను ఇంట్లో ఉతకండి ... షర్టులు, టవల్లు, చీరలు, పిల్లల దుస్తులు, దుప్పట్లు, ప్రతి బట్టనూ! కుటుంబంలో అందరి బట్టలనూ సర్ఫ్‌తో ఉతకండి. సర్ఫ్ యొక్క ఉతికే అధిక శక్తివల్ల సులభంగా మీ బట్టలు అమిత తెల్లగాను పరిశుభ్రంగాను వుంటాయి. నేడే సర్ఫ్ వాడి, చూడండి! అది బట్టలను ఇంట్లో ఉతుక్కునే అత్యుత్తమ విధానం.

# సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకును!

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి SU. 24 X52 TL

అన్నాడు. అంతే, పెద్ద పెట్టున ఉరుము, ఆ తర్వాత మెరుపు, వెంటనే వడగళ్ళవాన .... రామారావు తెల్లబోయాడు. బామ్మ చేతులు తిప్పుతూ, మూతి విరుస్తూ చెప్పుకుపోతోంది. అతనికి స్పృహ (మాట్లాడటానికి అవకాశం) వచ్చే సరికి "ఇంతకీ నాది బుద్ధి తక్కువరా! నన్ను మొన్న అంటే ప్రాణాలు తీసి తీసుకొచ్చావ్! అయినా నాకెందుకూ అంట? వంటా, వెంటా! సుక్షేత్రంలాంటి పొలం. కాలు మీద కాలేసుకు తిన్నా నా జీవితం వెళ్ళమారి పోతుంది. పసిగడా తల్లి, తండ్రి లేరని పెంచి పెద్ద చేసినందుకు బాగానే బుద్ధి చెప్పించావ్ నీ పెళ్ళాంచేత! అయిందేదో అయింది. ఇహ నేను క్షణం గూడా ఉండను, నన్ను రైలెక్కించెయ్" అంది

ఎప్పుడు వచ్చిందో జానకి వంటింటి గుమ్మంలో నుంచి లోపలికివస్తూ "మీరు పోవటమెందుకు? మధ్య వొచ్చిందాన్ని నేను. నేనే పోతాను .... నన్నే రైలెక్కించండి." అంటూ రామారావు వంక చూచింది.

అతనికి యిది మరీ విపరీతంగా కనిపించింది.

"ఎందుకూ పెళ్ళాం, మొగుళ్లను వేరు చేయించావని అపవాదు వేయించటానికా? అదేం వద్దు నేనే పోతాను."

"కాదు నేనే పోతాను. బామ్మ, మనవళ్లను వేరుచేశావని నాకుమాత్రం రాదా చెడ్డపేరు?"

"కాదు నేనే పోతాను."

"కాదు నేనే పోతాను."

అంతవరకు వాళ్లిద్దరి మధ్య గుడ్లు మిటకరించి చూస్తున్న రామారావు అడ్డు తొలిగాడు.

"కాదు నేనే"

"కాదు నేనే."

"కాదు.

"కాదు."

ఆసమయంలో ప్రవేశించింది అసలు కారణం. మరుక్షణం బామ్మ కోపంతో "ఛీ.... పాడుమొహందానా" అంటూ పక్కనే వున్న గరిటెను అందుకుంది. మళ్ళీ సాగింది యుద్ధం.

"కాదు నేనే."

"కాదు నేనే"

రామారావు బుర్ర వేడెక్కిపోతోంది, వళ్ళు, గుడ్లు తేలేస్తూ ముక్కు దగ్గరకు వచ్చేశాయి.

ఆ సమయంలోనే అసలు కారణం జానకి కాళ్ళ దగ్గర నిలబడి ధైర్యంగా తోక ఎత్తి 'గుర్రు' మన్న శబ్దంతో ప్రారంభించి, బామ్మని చూస్తూ "భౌ, భౌ" మని మొరుగుతూ విజయం పొందే వీరునిలాగా ఒక్కొక్క అడుగు ముందుకు వెయ్య సాగింది. "ఛీ .... ఆయ్ .... పాడుమొహందానా. ఛూత్..." అంటూ చేతిలోని గరిటె పైకెత్తింది బామ్మ. రెచ్చిపోయింది అసలుకారణం. జోరుగా ముందడుగు వేస్తూ బామ్మమీదికి లంఘించింది. బామ్మ భయంతో కూడిన ఆశ్చర్యంతో చూస్తూ "ఛీ ... ఛా .... ఆయ్" అంటూ వెనుకడుగు వెయ్యసాగింది.

ఎత్తయినదేదీ కనపడక రుబ్బురోలు మీద కెక్కింది బామ్మ, "భౌ, . భౌ"అంటూ రుబ్బు

# బామ్మా బొచ్చుకుక్కా

రోలుదాకా తరిమింది అసలు కారణం. తెలియని భయంతో ఆవేశం పొంగుకురాగా చేతిలోని గరిటెతో దాన్ని ఒకటి వడ్డించింది బామ్మ. అంత వరకూ ధైర్యంతో ముందడుగు వేసిన అసలు కారణం దెబ్బతో తోక ముడిచి "కుయ్ కుయ్" మంటూ జానకి దగ్గరకు పరుగెత్తింది. "ఛీ. పాడు కుక్క (అసలుకారణం) నీ మూలంగానే కలతలు ప్రారంభ మయ్యాయి, నిన్ను లేకుండా ఉన్నా బాగుండేది" అంటూ రామారావు దాని వంక తీక్షణంగా చూచి, "ఛీ అవతలికి" అని ఒక్క తన్ను తన్ని అక్కణ్ణుంచి వెళ్లిపోయింది. తన్నుతో "కుయ్యో .... కుయ్యో" మంటూ పారిపోయింది కుక్కపిల్ల.

అప్పటిదాకా మూగనోము పట్టిన రామారావు చైతన్యవంతుడై "జానకీ! .... జానకీ!" అంటూ

"ఇంతకూ మీ భార్యాభర్తల కీచులాట ఎలా అంతమైంది?" గోపాలంగార్ని పక్కింటి పెద్ద మనిషి అడిగాడు.

"ఒహో అదా! మామూలే. ఆవిడే నన్ను పలకరించింది."

"ఏమందేమిటి?"

"ముందు ఆ మంచం క్రింద నుంచి బయటకురా! అని పిలిచింది. "గోపాలంగారు అమాయకంగా చెప్పేశారు.

ఎస్. వి. ఎల్. నారాయణ (నరసరావుపేట)

ఆమె వెళ్ళిన వైపుకు రెండడుగులు వేసి, మళ్ళీ బామ్మవైపు తిరిగాడు. అతన్ని గుర్రుగా చూస్తూ "కొత్త పెళ్ళాం వెళ్ళిం, తల్లి (ఈ సమయంలో అతనికి తల్లి, దండ్రీ లేరు కాబట్టి, బామ్మ) దయ్యం అని ఊరికే అన్నారా? ఏదైనా కానీ ఈ ఇంట్లో ఆ కుక్క ఉండటమో నేనే ఉండటమో తేలేవరకూ తిండీ తిప్పలూ లేవు" అంది ఖచ్చితంగా

తిండిపేరెత్తేసరికి రామారావు కడుపులో ఇంతగా ఉన్న ఎలుకపిల్ల అంతగామారిపోయి సరాళ్ళి 'కరకర' కొరకసాగింది తాళలేక రెండు చేతులూ తలమీదకు చేర్చి "అమ్మ బాబోయ్ .. నాయనోయ్ ...... ఇంక ఈ పూటకి కూడు ప్రాప్తి లేదుర్రా దేముడోయ్ .." అంటూ చిన్న హైజంప్ చేసి అక్కణ్ణుంచి సావిట్లోకి దూకి వీధిలోకి పరిగెత్తాడు.

* * *

ఇంతకూ అసలు కారణమేమిటంటే, ఒకానొక దుర్ముహూర్తపువేళ శ్రీమతి రామారావు ఒకానొక పత్రికా ప్రకటనను చూచి మరుక్షణం భర్తను ఆదేశించింది. ఆదేశాన్ని అందుకుని అతను ఈ క్రింది విధముగా చదివాడు.

అమ్మబడును.

అందమైన బొచ్చుకుక్కపిల్లలు. మేలుజాతికి చెందినవి. కోరిన రంగులో, కారు చౌకలో.......

అనాడు జానకి కోర్కె తీర్చటానికి అరాముదు వెళ్ళగా, ఈనాడు రామారావు బయల్దేరాడు. కాశీ వచ్చిన చిక్కు ఆ రాముడికి శ్రోత్రియ ఆచార వ్యవహారాలు, ముఖ్యంగా కందివచ్చుడి స్పెషలిస్టు అయిన బామ్మలేదు, మన రామారావుకి ఉంది. అందుకే కథ అడ్డం తిరిగింది.

బొచ్చుకుక్క ఇంట్లో ప్రవేశించింది మొదలు బామ్మకు బద్ధవైరిగా మారింది.

* * *

హోటల్లో బాగా పట్టించి "బ్రేక్" మంటూ బిల్లు చెల్లించి బయటకు వచ్చాడు రామారావు. అప్పటికి రాత్రి తొమ్మిదయింది. ఎక్కడికి పోవాలి? అన్నది ప్రశ్న. ఇంటికి పోతే బామ్మ రైలెక్కించమంటుంది. బామ్మపోతే కందివచ్చడో?

ఆసమయంలో అతనికి ఎక్కడ్లేని వైరాగ్యం మొలుచుకొచ్చింది. ఏదైనా ఒకవేళ కుండీ ప్రక్కని వీధిదీపం కనిపిస్తే దారిపోయే ఒకముసలి కుక్కని తొక్కొచ్చి, కూర్చుని "జగమేమాయ, బ్రతుకే మాయా"అని యేడ్చేద్దామనుకున్నాడు, చుట్టూ చూస్తుండగా తటుక్కుమందొక సాక్షాత్కారం. అదే.. ఆపద మొక్కులవాడు, వడ్డికాసులవాడు, కలియుగ ప్రత్యక్షదైవం అయిన ఏడుకొండల వెంకటేశ్వరస్వామి (వెంకటరమణ) వారసుడు (రమణ.)

రామారావుకి ఉత్సాహం ఉరకలు వేసింది. "ఒరే రమణా.....ఒరే రమణా" అంటూ కేక పెట్టి పరుగు లంకించుకున్నాడు. ఇంత జరిగినా అసాక్షాత్కారం గమనించకుండా గుర్రపుజాలు లాంటి జుట్టు ముందుకు పడుతుండగా, పవా పైజమా, షర్టులు ధరించి, కొర్లేటి కొంగలాపీలంగా పొడుగ్గా ఉన్న శరీరాన్ని గాలిలో తేల్చివేస్తూ సాగి పోతోంది.

ప్రయాణమీద అతన్ని చేరుకున్న రామారావు "ఒరే రమణా!" అంటూ వీపుమీద ఒక్కటి చరిచాడు. దెబ్బతో ముందుకు పడబోయి తమాయించుకొని "ఎవరూ?.....ఆ......ఆ రాముడే... నా శ్రీరామచంద్రుడే. ఇన్నాళ్లకు ఈ భక్తుడిమీద దయగల్గిందా తండ్రీ, ఈరోజాకు వీక్షపారవం నామీద కురిపించావా? వెధవ సన్యాసీ ...జమీన్. .సంసారీ, ఆదివాడు (ఆదివారం) సినిమాకు పోదామని వాగ్దానం చేసి మోసవుచ్చావు కదురా దొంగగాడిదా? ఇహ నిన్ను వదల్ను పద భద్రాద్రికి"

"భద్రాద్రికా?"

"అదేరా మన భద్రాచలం హోటల్ కి ఇవాళ శుక్రవారం కదా! మా శ్రీమతి ఖజానా తాళాలు చస్తే కదలవు. ప్రొద్దుట్నుంచి ఆఫీసులో దుమ్ము దులిపి వదిలారు మాభర్తగారు .. జమీన్ మా మేనేజర్! నీకేం? బంగారు పిచ్చుకలాంటి బామ్మో చక్కని గవర్నమెంటు ఉద్యోగం ఉంది ...."

"ఆ .ఆ .అంటూ ఉన్నారుగానీ గొంతుమీదికొచ్చింది.పద .ముందు కాఫీతాగివాకొక సంపోయిద్దా గాని"

"సంపోకు మనది పెట్టిందిపేరు కాఫీయిప్పించు కావల్సినన్ని సంపోలు సరఫరాచేస్తాను." అంటూ చంకంలోని స్త్రైలును పైకి నెట్టుకుంటూ ముందుకు నడిచాడు, రామారావు అనుసరించాడు

* * *

"అయితే కథ చాలా ముదురుపాకానికి వచ్చేసిందన్నమాట" అన్నాడు సిగరెట్ నుసి దులుపుతూ రమణ రామారావు కుర్చీలో వెర్లబడి కళ్ళు మూసుకున్నాడు

"నాన్నా, నాన్నా! ఈ బొమ్మ చూశావా ఎగ్జిబిషన్‌లో కొన్నాం," అంటూ ఒక ప్లాస్టిక్ బొమ్మను ఊది చూపాడు ఆరేళ్ళ రమణ కొడుకు

రమణ అందుకొని తనూ ఊదాడు రామారావు కళ్ళు తెరిచాడు రమణ మళ్ళీ రెండుసార్లు ఊదాడు రామారావు నవ్వుతూ "ఒరే నువ్వు చిన్నవాళ్లల్లో చిన్నవాడివి, పెద్దవాళ్లలో పెద్దవాడివి!" అన్నాడు

రమణముఖంలో నూతనోత్సాహం కనిపించింది "ఒరే దొరికిందిరా! దొరికింది" అన్నాడు పెద్దగా

"ఏమిట్రా?"

"అదేరా! మార్గం ఇప్పుడు చెప్పు మీబామ్మకి ఏవంటే ఎక్కువ ఇష్టం?"

"మా బామ్మ కందివచ్చడంటే నాకు మహా ఇష్టంరా!" అన్నాడు ఉత్సాహంగా

"ఏడిశావ్ వెధవ సన్యాసీ నీయిష్టం ఎవడికావాల్రా? మీ బామ్మకి మీబామ్మకిరా!" అన్నాడు పెద్దగా

"మా బామ్మకా " ఆలోచించి, "ఒరే! ఒకప్పుడు స్పెషల్‌యాత్రా ట్రైనులో పోయి మాబామ్మ పుణ్యక్షేత్రాలు దర్శించి దొరికినంత వరకూ వెండివి, లేకపోతే ఇత్తడివి, కాకపోతే రాతివి సర్టిఫికేట్లు (విగ్రహాలు) తెచ్చిందిరా! అవంటే ఆమెకు అరోప్రాణం ప్రతి ఆదివారం ఆవుపాలతో శుద్ధి చేయందే ఆమెకు నిద్రపట్టదు"

"అబ్బా చంపావురా! నిద్ర పేరెత్తి నా నిద్రా దేవతను మేలుకొలిపావు, ఇహ ఆలోచించలేను ఈ పూటకి మాయింట్లో పడుకుని రేపు యింటికి వెళ్ళు, అప్పటికి సద్దు మగణవచ్చు"

"రేపు కాదు వారంతర్వాత వెళ్లినా కుక్కను వెళ్లగొట్టందే బామ్మ ఉండదు, వెళ్లగొడితే మా శ్రీమతి ఉండదు ఎలారా !"

" ఊ చిక్కేనే " కాసేపు తల తాటించి "ఒరే! రేపు రాత్రికి మీ యింట్లో దొంగలు పడాల్రా" అన్నాడు రమణ

ఒక్కసారి ఎగిరి కూర్చుని "అయ్యో బాబోయ్ .. దొంగలే" అంటూ గావుకేక పెట్టాడు రామారావు

"ఆ.. నిశ్చయంగా దొంగలు పడాలి" అన్నాడు రమణ ఖచ్చితంగా

"అదేమిట్రా ?" అన్నాడు నీళ్ళు కారిపోతూ

అతని బిక్క మొహం చూచి జాలిపడి "ఇలారా దగ్గరగా" అతని చెవిలో ఏదో చెప్పాడు రమణ.

# బామ్మా బొచ్చుకుక్కా

"ఒరే ! .... ఒరే ... నీ బుర్ర' అంటూ మాటలకోసం వెదుక్కోసాగాడు రామారావు

"ఆ .. ఆ .... ఆనందంలో కొరబోయేవు, నా బుర్రకి పని కల్పించినందుకు ఆదివారం ఉదయం భద్రాద్రి (భద్రాచలం హోటల్) ప్రయాణం" అంటూ లేచి నిలబడ్డాడు రమణ, రామారావు ఒకప్పుడు క్లాస్‌మేట్స్. కొద్ది బంధుత్వం కూడా ఉంది

* * *

దూరంగా కీచురాళ్ళ చప్పుడు అంతకు రెండు గంటల పూర్వమే బామ్మా, జానకీ కుక్కని గురించి చిన్న వాగ్యుద్ధం చేసారు విసిగి పోయిన రామారావు మర్నాడు ఏదో ఒకటి తేల్చేస్తానని మాట యిచ్చాడు

"ఆసీను అదే కార్మికుల తిరుగుబాటు సీను, పేంగొప్పగా తీశారండీ!" చిత్రనిర్మాత దర్శకుణ్ణి అభినందించాడు

"అందులోనా ప్రతాపమేముంది లెండి! అంతా మీచలవే ఎక్స్‌ట్రా వేషగాళ్ళ కూలీ డబ్బులు సగానికి సగం తగ్గించి మీరు ఇచ్చినరోజునే ఆసీను తీశాను" దర్శకుడు మెహమాట పడుతూ అన్నాడు

కె. నాదమునిరెడ్డి (మద్రాసు)

గదిలో పడుకున్న అతనికి ఏదో శబ్దం వినిపించింది, తలెత్తాడు "ఏమండీ ! నిద్రపోలా ?" అంది జానకి

ఖంగారుగా "ఆ పోయా ఆ ఆ పోతున్నా లేదు ... నిద్ర వస్తోంది" "హోయ్" అంటూ రాని ఆవలింతను తెప్పించుకున్నాడు

మరో గంట గడిచింది దొడ్డిగుమ్మం గొళ్లెం చప్పుడైంది ఏదో పిట్ట మూడుసార్లు కూసింది రామారావు మెల్లగా లేచి సావిట్లోకి వచ్చాడు బామ్మ చాపమీద పడుకొని "గుర్రు" పెడుతోంది డ్రాయరు కొడుకు గొలుసుతో కట్టి వేయబడ్డ కుక్కపిల్ల తలెత్తి అతనిని చూచి తోక "టక, టక" లాడించి మళ్ళీ పడుకుంది ఇటీవల బామ్మచేత గరిటెదెబ్బ తిన్నప్పట్నుంచీ అది అరవటం మానేసింది అతను వంటింట్లోకి వెళ్లి దొడ్డి తలుపు తీశాడు "ఒరే రామిగా! చిన్నప్పుడు ఏనుగులు తొక్కినా లేచేవాడివి కాదు నీ కింత త్వరగా మెలకూ ఎలా వచ్చిందిరా ?" అన్నాడు రమణ లోపలికి ప్రవేశిస్తూ

"ష్ !"

రామారావు, రమణ, బామ్మ పూజామందిరం సమీపించి అక్కడున్న విగ్రహాలన్నిటిని మూట కట్టి దొడ్డిగుమ్మం అవతల పెట్టి వచ్చారు. రామారావు బీరువాలోనుంచి జానకి నెక్లెస్, రాళ్ళ గాజులూ తెచ్చి ఆ మూటలో కుక్కాడు

"ఇహ దాన్ని లాక్కురా" అన్నాడు రమణ, రామారావు కుక్కపిల్లను తెచ్చాడు అది తోక ముడిచి తల వంచుకుంటుందేకానీ మొరగదు. "ఒరే ! ఎట్లారా అరిపించటం ?" అన్నాడు దిగాలుపడి

రమణ దాని నోరు తెర్చి "బోయ్" అన్నాడు. అరవలేదు "ఓయ్ అరు ఊ ఆ" అని సన్నగా గొణిగాడు విసిగి కోపంతో దాని తల మీద ఒక్కటి కొట్టాడు "కుయ్ కుయ్ " అంది కుక్కపిల్ల బాధగా

"ఆ అదీ సరిగ్గా కానీ స్వరంలో తేడా. ఫర్వాలేదు నిద్దరలో ఉన్నవాళ్లను నమ్మించొచ్చు .. తెల్లారిందిగా, వస్తా రేపొద్దున కల్సుకో" అంటూ దొడ్డి గుమ్మంనుంచీ దూసుకుపోయాడురమణ

కొద్దిసేపటి తర్వాత రామారావు కుక్కపిల్ల తలమీద ఒక్కటి మొట్టాడు "కుయ్ కుయ్" అంది వెంటనే "దొంగ .. దొంగ ... పట్టుకోండి" అంటూ వంటింట్లో చిందులు వెయ్యసాగాడు.

బామ్మా, జానకీ నిద్రకళ్లతో పరుగెత్తుకొచ్చారు రామారావు కుక్క మొరిగిందనీ, తనకు మెలకూ వచ్చిందనీ, ఎవరో పరుగెత్తారనీ, అతని వెనుక కుక్క తరిమిందనీ చెప్పుకుపోతున్నాడు "ఆ" అంటూ బామ్మ పూజా మందిరం వైపుకూ జానకి బీరువావైపుకూ ఉరికారు అతను దొడ్డి గుమ్మంవైపుకు వెళ్లి మూటను మోసుకొచ్చాడు. అన్నీ సవ్యంగా ఎవరివి వాళ్ల కందాయి.

"ఎంతైనా కుక్క విశ్వాసం గల జంతువు" అంది బామ్మ, బొచ్చుకుక్కవంక ప్రేమగా చూస్తూ, కష్టపడి సంపాదించుకున్న పుణ్యాన్ని మళ్ళీ పూజామందిరంలో పునః ప్రతిష్ఠ చేస్తూ .. జానకి ఆప్యాయంగా కుక్కపిల్లను చూచి రాళ్ల గాజులను చేతికి తొడుక్కోసాగింది

* * *

హోటల్లో కూర్చుని విరగబడి నవ్వుకున్నారు, రామారావు, రమణ "ఒరే ! నీ ఆలోచన భలేగా పనిచేసిందిరా ! ఇవాళ బామ్మ కుక్కపిల్లకి పాలన్నం స్వయంగా తినిపించింది థాంక్సురా !" అన్నాడు హుషారుగా

"థాంక్సు నాక్కాదురా ! వస్తానుండు" అని హోటల్లోని సంపుదగ్గరకు వెళ్లి, వచ్చి ప్లాస్టిక్ బొమ్మలను నోట్లో పెట్టుకు ఊదాడు "కిర్ కిర్" మంది ఆ బొమ్మ పిట్టలాగా దీనికి చెప్పు మావాడు దీన్ని ఊదుతూండగానే నాకా ఆలోచన వచ్చింది"

రామారావు గొల్లున నవ్వాడు అర్థంకాక పోయినా, అంతవయస్సువచ్చిన వ్యక్తి చిన్న పిల్లల బూరా ఊదుతున్నందుకు హోటల్లోని వాళ్లంతా పకపకా నవ్వారు ఒక్క క్షణం వాళ్ళ వంక తీక్షణంగా చూచి తనూ వాళ్ళతో శ్రుతి కల్పాడు రమణ 

# "ప్రాయశ్చిత్తం"

(దర్శకత్వం : భీమసింగ్ సంగీతం : విశ్వనాథన్ రామమూర్తి, వెంకటేశన్, మాటలు, పాటలు : అనిసెట్టి, చిత్రం తమిళం "పాశం పళమురం" యొక్క తెనుగుసేత నటీనటవర్గం శివాజీ, నాగయ్య, సరోజాదేవి, జానకి ఎం ఆర్ రాధా మున్నగువారు.)

సినిమాలను 2 డీ లంటారు. రెండు పరిమాణాలే ఉంటాయి. అందుచేత సినీ కాలమహిమలు, సినీ విధివైపరీత్యాలు యివి కొందరికి కొంచెం "విచిత్రంగా" తోచవచ్చును మరి. కాని చలనచిత్రమన్నాక ఆమాత్రం సినీ ట్రిక్కులు తప్పవు మరి. మరో సంగతి అందరికి తెలిసిందే. సినీమాలు రెండు విధములు. (ముఖ్యంగా తెనుగు బయిస్కోపులు) ఒకరకం "తీసినవి" : రెండో రకం (తర్జుమా) చేసినవీ అని. అసలు కథలోకి రాకమునుపు మరొక్క ముక్క: కథోచితంగా పాత్రలు, పాత్రోచితమైన గాత్రాలు, "అసలు" చిత్రోచితమైన సంభాషణలు, వెరసి "డబ్" చేసే సినీమాను అనువాద చిత్ర మంటారు. 'ప్రాయశ్చిత్తం' లో 15 రీళ్ళు సాగే "ప్లాటు" మధ్య మధ్య మంచి మంచి పాడుకుందికి వీలయ్యే పాటలు ఉన్నాయి. అనగనగా ఒక ఉదారుని సాయంతో 'రవి' అమెరికా వెళ్లి డాక్టరై తిరిగి వచ్చి మద్రాసు ఆస్పత్రిలో ఉద్యోగం పొందుతాడు. కాన్సర్ వ్యాధికి మందు కనిపెట్టాలని దృఢసంకల్పుడైన 'రవి'కి నర్సు 'శాంతి' అర్ధాంగిగా అమరుతుంది. నర్సులూ, డాక్టరులూ పెళ్లిళ్లు చేసుకోడం మంచి ఆదర్శమే నని కూడ బలుక్కుని తనను పెంచిన ఉదారుని కుమార్తె 'నళిని' ని కాదని శాంతిని పెళ్లాడుతాడు రవి. శాంతి శ్రమదానంతో కాన్సర్ వ్యాధికి మందు కూడా కనుక్కుంటాడు కాని, శాంతికి క్షయ అంకురించి ఆమె భర్త పరిశోధనలకు ఆటంకం కారాదనే ఉద్దేశంతో యిల్లు వెడలి పోతుంది. కథలో ఓపాత్ర నిష్క్రమిస్తేగాని మరో పాత్ర ప్రవేశించలేదు గనుక "శాంతి" (తాత్కాలికంగా) రైలు ప్రమాదంలో మరణించిందని రేడియో చెబుతుంది. 'రవి' నమ్ముతాడు. ప్రేక్షకులు అసలు 'శాంతి' స్విట్జర్లండు వెళ్లడం చూస్తారు గనుక చలి●కుండా, 'రవి' ఏమవుతాడా ? అని చూస్తూ ఉంటారు. కాని 'నళిని' (రవిని పెంచినవారి పుత్రిక) 'రవి'కి రెండో భార్యగా వస్తానని, అందుకుగాను ఓ సినీ ట్రిక్కుతో పహా పన్నాగం పన్నుతుంది. 'రవి' అంగీకరిస్తాడు. అయితే ఆ యిరువురి దాంపత్యం నరక ప్రాయమే అయింది. ఈలోగా 'శాంతి' కి స్విజ్జర్లాండులో వ్యాధి నయమైంది. రవికి శాంతి ధ్యాస. నళిని 'రవి' చేతికి "బెస్టు ట్యాబుల" ను "మందుల" ను అందించి చీవాట్లు తినడం అలవాటూ అయిపోతాయి. కాని "కాలం" ఎన్ని "రీళ్ళు" అలాగే ఉంటుంది ? 'రవి' కి కళ్ళు పోతాయి 'శాంతి' వచ్చి తన భర్త మరో పెళ్లి చేసుకోడం, కళ్ళు పోగొట్టుకోడం చూసి మళ్లీ 'నర్సు' గా అతనికి ఉపచర్యలు చేస్తుంది కాని రవి తమ్ముడు అమెరికా నుంచి వచ్చిరని కళ్ళు బాగుచేస్తాడు. దాంతో రవికి యిద్దరి భార్యల సమస్య ఉత్పన్న మవుతుంది. 'శాంతి' ని చూసి బోలెడు సంబరపడిపోయిన రవి నళిని దగ్గర విడాకులు పుచ్చుకుందికి నిర్ణయించుకుంటాడు. మరి 'నళిని' ? ఈ పాత్ర కథను లాగడానికి వచ్చింది గనుక ఆ "నేరా" నికిగాను "ప్రాయశ్చిత్తం" చేసుకుంటానని విమానమెక్కి జెనీవా వెళ్లిపోతుంది.

సినిమా లన్నాక అనేక పాత్ర లుంటాయి అన్నింటికీ వ్యాయం చేయడం ఎలా సాధ్యం ? అంచేత కొన్నింటిని 'రెడ్‌క్రాస్' శిక్షణ యిప్పించేటందుకు జెనేవా పంపడం అవసరమే మరి. 'సినీ' కాల ప్రభావంచేత "మనిషిని పోలిన మనుషులు" ఉంటూనే ఉంటారు. ఈ చిత్రంలోను చివర సీనుల్లో యిలాంటి "ట్రిక్కు" లున్నాయి. మామూలు సినీ "చిక్కు" లూ, "ట్రిక్కు" లూ తోడుగా "మాటలూ పాటలూ" గల యీ "ప్రాయశ్చిత్తా"న్ని డబ్ చేయడంలో వలసిన జాగర్తలన్నీ అవలంబించిన నిర్మాతలు అభినందనీయులు

—కృష్ణానంద్.

సుప్రసిద్ధ బ్రిటిష్ తత్వశాస్త్రవేత్త బర్‌ట్రాండ్ రస్సెల్ అభిప్రాయాలు సొంతం చేసుకుని ఒక ప్రబుద్ధుడు పుస్తకం రాశాడట. అంతటితో ఆగక, ఆ పుస్తకానికి పీఠిక రాయమని ఆయన్నే కోరాడు.

ఈ సాహసానికి ఆశ్చర్యపోయిన రస్సెల్, "లజ్జ అడ్డు వస్తోంది" అని రెండే రెండు మాటలలో సమాధానం వ్రాశారట.



"ప్రాయశ్చిత్తం"లో జానకి, సరోజాదేవి.



మంచిమనసుల్లో నాగేశ్వరరావు, సావిత్రి.

# సినీవిహారం

10-వ పేజీ తరువాయి

దర్శకుడు : టి. రామారావు, కళ : జి. వి. సుబ్బారావు. నిర్మాత : అనుమోలు వెంకటసుబ్బారావు.

## మనరాముడు మహారాజు

అయోధ్యా నగరంలోని ప్రతి అణువు ఆనందంతో నృత్యం చేస్తోంది. శ్రీరామచంద్రుడు మహారాజుగా పట్టాభిషిక్తు డయ్యాడు. పధ్నాలుగు సంవత్సరాల కష్టాల అనంతరం, ప్రజల కోరికలు తీరే తీరుగా, కనులపండువుగా శ్రీరాముడు మహారాజైనాడు.

అయోధ్యారాముని అంతఃపురం, సూర్యాన్వయాబ్ధి సోముడు రామునిమందిరం సూర్యుడు, అశ్వాలు గల శిల్పాలతో, రతీ మన్మథులు, శివ పార్వతుల చిత్రాలతో శోభాయమానంగా ఉంది అందులో పరిచారికలు ఆ మహత్తర శుభసమయంలో



"మంచిమనసులు"లో జానకి.

తమ ఆనందోత్సాహాలను ఆటపాటలతో ప్రకటిస్తున్నారు.

ఈ ఆనందోత్సాహదృశ్యం లలితా శివజ్యోతి వారి గేవాకలర్ చిత్రం "లవకుశ" లోనిది. కవి సముద్రాల సీనియర్ రచించిన ఈ పాటకు సంగీత దర్శకుడు ఘంటసాల బాణీ కుదిర్చాడు. జానకి, ఉడుత, శోభ, కమల, సరోజిని బి. ఏ., బి. ఎల్. పాడారు. నృత్యదర్శకుడు వెంపటి సత్యం సూచించిన భంగిమలను సుకుమారి, మరో పది మంది యువతులు ప్రదర్శించారు. ఈ చిత్రానికి దర్శకుడు సి. పుల్లయ్య, అసోసియేట్ డైరెక్టర్ జి. వి. ఆర్ శేషగిరిరావు, కామెరా పి. ఎల్. రాయ్, కనుల పండువుగా సెట్ వేసిన కళా



"సిరిసంపదలు"లో
బాలసరస్వతి, రేలంగి.

## సినీ విహారం

దర్శకుడుగా టి. వి. ఎస్. శర్మ, నిర్మాత : శంకర రెడ్డి. ఏప్రిల్ నెలలోనే నిర్మాణం పూర్తికాబో తున్న ఈ చిత్రంలో శ్రీరాముడుగా ఎన్. టి. రామారావు, సీతగా అంజలీదేవి, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులుగా కాంతారావు, సత్యనారాయణ, శోభన్‌బాబులు, వాల్మీకిగా నాగయ్య, వసిష్ఠుడుగా ధూళిపాళ, లవుడుగా మాస్టర్ నాగరాజ్, కుశుడుగా మాస్టర్ సుబ్రహ్మణ్యం నటిస్తున్నారు.



భీష్మ"లో నారదుడుగా, రేలంగి.

### 'శ్రీ సామ్రాజ్యం'

పురుషోత్తమా పిక్చర్స్ అనే సంస్థ "స్త్రీ సామ్రాజ్యం" ను తయారు చేస్తున్నది అంజలీదేవి, మాధురీదేవి, మనోహర, రమాసంగ్ పాల్గొన్న యీ చిత్రానికి కె వి ఆర్ ఆచార్య (మాటలు), బి ఎస్. ఆచారి, కోట రంగయ్యశాస్త్రి, కొప్పల వసంతరావు (పాటలు), బాబూరావు (సంగీతం), గడ్డం కృష్ణమూర్తి (కూర్పు), బి పురుషోత్తం, డి సూర్యప్రకాశరావు (నిర్మాతలు) అధ్వర్యం వహిస్తున్నారు

### 'అమరశిల్పి జక్కన్న'

ఆంధ్రావనికి ఎక్కని 'పెళ్ళితాంబూలం' సమర్పించిన దర్శక నిర్మాత శ్రీ బి యస్ రంగా ఆమ 'అమరశిల్పి జక్కన్న'ను రంగుల్లో సింగారించబోతున్నారు నాగేశ్వరరావు, బి సరోజాదేవి ప్రధాన భూమికలు నిర్వహించనున్న ఈ చిత్రం ఛాయాగ్రహణం, దర్శకత్వం, నిర్మాత శ్రీ బి ఎస్ రంగాయే స్వయంగా నిర్వహిస్తారు

### ప్రజాశక్తి

, మురుగన్ బ్రదర్స్‌వారి 'ప్రజాశక్తి' త్వరలో విడుదల కానున్నది ఇ వి సరోజ, ఆనందన్, అశోకన్, యం వి రాజమ్మ, సరస్వతి పాల్గొంటున్న ఈ చిత్రానికి మాటలు, పాటలు అనిసెట్టి, సంగీతం విశ్వనాథన్ అండ్ రామమూర్తి, దర్శకుడు త్రిలోక చందర్ (యం. ఎ.)







SWASTIK

# హరివంశం

11-వ పేజీ తరువాయి

రించుట బ్రాహ్మణధర్మమగునా! అది బంధమగునుగాని, ధర్మముకాదు. అది ధర్మమే యందురో, నేను ఆ బంధమును గూడ నిప్పుడు త్రెంపివేసికొనుచున్నాను." అని పంచజనునిచూచి, "పంచజనుడా! నీవు నిజముగా పంచజనుడవా! పరమశివుడవా! ఏదీ! ఈ బ్రాహ్మణులందరు చూచుచుండ, నేను నీవద్ద నుండి యీ దానమును గ్రహింతును." అనెను. బ్రాహ్మణులు ముందు తెల్లపోయిరి తరువాత నవ్విరి. వారిలో ఒక్కడు "అవును! మహానంద! నీభార్య యింటివద్ద బంగారమును తెమ్మని మారాములు చేయుచున్నట్లు వినియున్నాము. నీకు రాజుగారి బంగారము పనికిరాదు. కడజాతివాని బంగారము పనికివచ్చుచున్నది. బాగుగా నున్నది ఇది విని రాజేమనునో!" అనెను

మహానందు డేమియు మాటలాడలేదు "పంచజనుడా! మరి ఇక ఆలస్య మెందులకు. నేను దానమును గ్రహింతునంటినికదా! ఇది వినుము. అప్పుడు దానము చేయుము నేను నా సర్వమును పరిత్యజించివేసినాను. ఇప్పుడు బ్రాహ్మ్యమునుగూడ పరిత్యజించుచున్నాను. అట్టి నేను బ్రాహ్మణుడనని నీవు ఎంతువో ఈ దానమును ఇమ్ము పరిగ్రహింతును. లేదో! నీ యిష్టము"

పంచజనుడు ఈసారి గల్లున నవ్వెను కైలాసపు చరియలపై పరమశివుడు ఆనందనాట్యావేశమ ఖీనమైన మనస్సుతో కాలిగజ్జెలలను గల్లున మొరసి చూచుకొనుచున్నట్టు లుండెను. "బ్రాహ్మణ బ్రాహ్మణుడన నెవ్వరు. బ్రహ్మమును ఎరిగినవాడ బ్రాహ్మణుడు. నేను నీకు దానము చేయుచున్నాను ఇటు మణికర్ణికాహ్రదముదరికి రమ్ము పాదముల కడిగెదను ధారాపూర్వకముగ దానము చేసెదను"

బ్రాహ్మణులు ఆ విచిత్రమును చూచుచు నచ్చటనే నిలబడిపోయిరి. పంచజనుడు మణికర్ణికాహ్రద తీరమున నొక్క విశదస్థలమును చూచుకొని, అచ్చట గోమయముతో పట్టువేసెను. అప్పటికే బాగుగా పైకివచ్చిన మార్తాండదేవుడు తన దివ్య కిరణములలోని మేలికాంతులను ఆపట్టు పెట్టినంతమేర యారనితడిలో సప్తవర్ణ కిమ్మీరితములైన రంగవల్లులను తీర్చెను పంచజనుడు తాను తెచ్చిన బంగారమును, టంకముల జాళెములను, మరియు నితర నాణెములను రాశిగా పోయగా, ఖరకరుని కిరణములలో నవి పరమశివుని మూడవదియైన నేత్రపు శోభనములైన కాంతులవలె మిలమిల మెరిసిపోయెను పంచజనుడు మహానంద బ్రాహ్మణుని చతురశ్రముగ తాను రచించిన గోమయపు పట్టుపై నిలిపి, భాగీరథీజలములతో నతని పాదములను ప్రక్షాళించి, గంధముచేత, అక్షతములచేత, పుష్పములచేత పూజించి, ఆ మహాధనరాశిని ధారాసలిలపూర్వకముగ దానముచేసెను

చేసి ఇట్టులనెను, "బ్రాహ్మణ! విశాలాక్షీ సహితుడైన కాశీపతి, విశ్వనాథుడు సంప్రీతుడైనాడు.

బ్రాహ్మణులు నవ్విరి. "ఓయి! పుల్కసి! విశ్వనాథుడు సరే! ముందు ఇది విని మా రాజు సంతుష్టుడు కావలయును" అనినారు.

# 1-వ బహుమతి వ్యాసం

16వ పేజీ తరువాయి

సాహిత్యంద్వారా పఠితల మనోవికాసానికి కృషి చేయటం రచయిత పవిత్రకర్తవ్యమెట్లో, దృశ్యకావ్యమని భావించే సినిమాద్వారా నిర్మాత బాధ్యతకూడా అలాంటిదే.

అది చేతకానివారు, అందుకు కావలసిన ప్రతిభా సంపత్తి లేనివారు యీ పరిశ్రమను విడిచిపెట్టినా యెవరికీ నష్టంలేదు. తెలుగుభాషకు సంబంధించి నంతవరకూ, సంవత్సరానికి తయారయ్యే, యే రెండుమూడు మంచి చిత్రాలకోసమో, సుమారు యాభై వ్యర్థచిత్రాలను, విధిలేక భరించవలసి వస్తున్నది. అంతేగాక నిర్మాణం ప్రారంభించాక మధ్యలో నిలిచిపోయిన చిత్రాలు ఎన్నిలేవు? వాటికై వెచ్చించినధనమెంత? వివిధదశలలో అలా ఆగిపోయిన చిత్రాలవల్ల, మొత్తం దేశంలో సుమారు రెండు కోట్ల రూపాయల పెట్టుబడి స్థంభించిపోయి నట్లు యిటీవల వెల్లడైంది. ఇలాంటి పరిస్థితి యెవరికీ శ్రేయోదాయకంకాదు. అలాకాక ప్రయోజనాత్మకంగా వుండే చిత్రాలు, ఇప్పటి మొత్తం సంఖ్యలో సగం తయారైనా ఫరవాలేదు. సంఖ్య తగ్గిపోవడంతోపాటు, ప్రస్తుత నిర్మాణంలో వున్న చిక్కులు పూర్తిగా తగ్గిపోతయ్. ముఖ్యంగా తారల అభావం, ఆర్థిక యిబ్బందులు ముందుగా ప్రేక్షకుల అభిరుచులు, వారి అలవాట్లు, అభిమాన విషయాలను గురించి దేశవ్యాప్తంగా, కూలం కషంగా పరిశోధనజరగాలి. తరువాత చిత్రాల సంఖ్యను క్రమబద్ధంచేస్తూ, నిర్మాతలు కాగోరే వారికి కొన్ని అర్హతలు తప్పనిసరిగా వుండాలనే ఆంక్షలు విధించాలి. వ్యాపారదృష్టితో ప్రేక్షకుల మనోదౌర్బల్యంతో చెలగాటమాడే కొందరు నిర్మాతల మనస్తత్వం అరికట్టబడాలి. మనదేశంలో వైద్యుడు కావాలన్నా, న్యాయవాది కావాలన్నా, కొన్ని అర్హతలు తప్పనిసరిగా కలిగివుండాలనే నిర్బంధ ముంది. కాని, సినిమా నిర్మాత కాదలుచుకున్న వారికి యెలాంటి అడ్డంకులు లేవు. పదిమంది దగ్గర సొమ్ము తేగలిగిన సామర్థ్యముంటే చాలు, తనదికాకపోయినా. ఈ స్థితినుంచి బయటపడేందుకు ముందుగా పరిశ్రమలోనివ్యక్తులు, సంస్థలే కృషి చేయవలసివుంటుంది. సినిమా నిర్మాతల సంఘం యిలాంటి విషయాలను పట్టించుకోకపోవటం శోచనీయం. ఏదో సాకుతో యెప్పుడూ ప్రభుత్వాన్ని సాధిస్తూ వుండటంతప్ప, పరిశ్రమకు తద్వారా ప్రేక్షకులకు ఉపయోగించేకొన్ని ప్రాథమిక విషయాలపై వారి దృష్టి యింతవరకూ పోలేదు.

తెలుగు సినిమాకు సంబంధించి, మన మాశించే మంచి చిత్రాలు నిర్మింపబడటం అసాధ్యమేమీకాదు. కావలిసిందల్లా, సంకల్పం, చిత్తశుద్ధి, చొరవతో ప్రయత్నానికి ఉపక్రమించటం. మనకు కావలసిన అన్ని హంగులూ వున్నయ్. విశ్వవిఖ్యాతిగాంచిన దర్శకులు మనకున్నారు. అద్వితీయులైన నటీనటులకు కొదవలేదు. మన సినీ రచయితలు కేవలం పాటల, మాటల కారులేకాదు, విఖ్యాత సాహితీవేత్తలుకూడా. ఇక ముందు యేలాంటి ప్రయత్న లోపమూ జరుగదని, మన మాశించే ఈ చిత్రాలు త్వరలోనే సాక్షాత్కరించగలవని ఆశిద్దాం. ★

# నికో
# క్రిమిసంహార సబ్బు
# పార్క్-డేవిస్ ఉత్పత్తి

మీ చర్మాన్ని, మొటిమలు, పొక్కులు, పేయడంనుంచి కాపాడి పరిశుభ్రంగా ఆరోగ్యంగా వుంచుతుంది. దీనితో నిత్యం తల రుద్దుకొంటే, దీని క్రిమిసంహారనురగ, చుండ్రు రాకుండా కాపాడుతుంది. నిరుపమానమైన నికో క్రిమిసంహార సబ్బు మీకు మూడు విధాల లాభం చేకూరుస్తుంది; అది పరిశుభ్రంచేయడం, క్రిములను నాశనంచేయడం, సంరక్షించడం. మీ చర్మానికి కావలసిన సంరక్షణ నిత్యంచేయండి.




NATIONAL PD 9162

(—మొట్టమొదటి క్రిమిసంహార సబ్బు, నిత్య ఉపయోగానికి)

# జీవితం నేర్పిన పాఠాలు

13–వ పేజీ తరువాయి

ఆ సహాయం లభించకపోతే మాత్రం తాము భయంకరమైన కష్టాలపాలు కావలసివస్తుందనీ వీరు వాదిస్తున్నట్లు కనిపిస్తుంది. అందరం ఒకే విధంగా జీవితంలో అడుగుపెట్టినరోజు జ్ఞాపకం తెచ్చుకుని ఈనాటి తమ స్థితికి లక్ష్మీదేవి చిత్తచాంచల్యమే కారణమని వీరు అనుకుంటారు. అందువల్ల, దురదృష్టవంతులైన మిత్రులకు జరిగిన అన్యాయాలకు పరిహారంగా యథాశక్తి తోడ్పడవలసిన బాధ్యత అదృష్టవంతులమీద ఉన్నది. ఈవిధమైన వాదాలు సహేతుకంగా ఉండకపోవచ్చుకాని, అసహజమైనవి మాత్రం కావు. ఈ ఊహలు బాగా పాదుకొనిపోయి, వాటినే గట్టిగా విశ్వసించేవారి నెందరినో నేను ఎరుగుదును. ఆదిలో ఎవరి ప్రవర్తన క్షమించరానిదిగా నాకు కనిపించేదో, వారినిగూర్చి ఇప్పుడు భిన్నమైన అభిప్రాయానికి వచ్చాను. పైభావాలు వారి దోషాన్ని తగ్గించే అంశాలుగా నేను పరిగణించటం మొదలు పెట్టాను.

నైతికప్రమాణాల విషయంలో పైతం ఇలాంటిదే అయినా, ఇంతకంటే పెద్ద మార్పు నాలో వచ్చింది. చిన్నతనంలో వీటి విషయమై నాకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలు ఉండేవి. కొన్ని నైతిక నిబంధనలు పరమపవిత్రమైనవనీ, వాటిని ఏమాత్రం అతిక్రమించినా గర్హించాలనీ భావించేవాణ్ణి. నేను పుట్టి పెరిగిన పరిమితప్రపంచమే నాకు ఈ భావాలు నూరిపోసిందని వేరే చెప్పనవసరం లేదు. ఆనాడు అమలులోఉన్న సాంఘిక కట్టుబాట్లను, ఆచారాలను ప్రశ్నింపనలవికాని సత్యాలుగా ఆ ప్రపంచం ఆమోదించింది. నేనూ వాటినే అనుసరించాను.

ముఖ్యంగా స్త్రీ పురుషులమధ్య, కుటుంబంలోని సభ్యులమధ్య, ఒకేకులానికి చెందిన వ్యక్తుల మధ్య, ఎక్కువ కులాలవారికి తక్కువ కులాల వారికి మధ్య ఏవిధమైన సంబంధాలు ఉండాలో ఆప్రపంచం ఇదమిత్థంగా నిర్ణయించింది. వీటి పర్యవసానంగా ఏర్పడిన సాంఘికజీవితం నా హృదయ ఫలకంమీద స్థిరమైన చిత్రంగా నిల్చిపోయింది. దాని మంచి చెడ్డలనుగూర్చి నాకు ఏ విధమైన సందేహం కలుగలేదు. ప్రధానవిషయాలలో నిర్దిష్ట ప్రమాణాలను అతిక్రమించడం క్షమార్హం కావచ్చునే ఊహ నాకు ఎన్నడూ కలుగలేదు.

కాని వయస్సు పెరుగుతున్నకొద్దీ మానవజాతిని గూర్చి నేను పెక్కువిషయాలు తెలుసుకున్నాను. నా చారిత్రిక పరిజ్ఞానంవల్ల వివిధజాతుల ఆచారాలలోనూ, కట్టుబాట్లలోనూ ఉన్న వ్యత్యాసం, వివిధ యుగాలలో ఒకే జాతి ఆచారాలలో వచ్చిన మార్పులు తెలిశాయి.

మానవజాతి ఎన్నడూ ఒకే విధమైన నైతిక ప్రమాణాన్ని అనుసరించలేదనే సత్యం నాకు కొట్టవచ్చినట్టు కనిపించింది. మన సమాజం క్షమార్హం కాని తప్పిదం అని నిర్ణయించినదానినే ఇతర నాగరికసమాజాలు బహు చులకనగా పరిగణించేవి. మతగ్రంథాలు, సమాజం నిర్ణయించిన నైతికప్రమాణాలు ఆధారంగా ఏ పురుషుణ్ణిగూర్చిగాని, స్త్రీనిగూర్చిగాని ఒకనిర్ణయానికి రాకూడదని నాకు క్రమేణా తెలిసి వచ్చింది. మానవుని ధర్మాలు మనువు ధర్మాలకంటే ముఖ్యమైనవి. మనుస్మృతులను ఏమాత్రం ఉల్లంఘించినా — విశేషించి స్త్రీలు — హిందూసమాజం అంతరిస్తుందని సాధారణంగా అంతా అంగీకరించిన అభిప్రాయానికి నేను విలువ ఇవ్వటం మానేశాను. వివిధవర్గాలకు చెందిన తప్పొప్పుల ప్రాముఖ్యాన్నిగూర్చి వెనుకటి నా అభిప్రాయాలు చాలావరకూ మారిపోయాయి.

ఉదాహరణకు మనసమాజాన్నే తీసుకుందాం. దాదాపు ఒకే ఒక సద్గుణాన్ని దృష్టిలో ఉంచుకుని ఈ సమాజం స్త్రీ నడవడికపై తీర్పు చెబుతుంది. ఈఒక్కటే ఏ కాస్త కొరవడి, ఉదాత్తమైనవని అంతా ఏకగ్రీవంగా అంగీకరించే సల్లక్షణాలు ఎన్ని ఉన్నా ఆలోటు భర్తీకాదు! ఈ నైతిక ప్రమాణం, ముఖ్యంగా పురుషులపట్ల దాని పక్షపాతవైఖరి, నాలో జిజ్ఞాసను రేకెత్తించాయి. అర్ధశతాబ్దానికిపైగా ఆలోచనచేసి, అనుభవం గడించినప్పటికీ, అది న్యాయసమ్మతమైనదనిగాని, సమదృష్టి కలిగినదనిగానీ నా మనస్సు అంగీకరించటంలేదు.

మానవుని ప్రవర్తనను, నడవడిని మొత్తం మీద పరిశీలించడంలో సాధారణంగా అంతా అనుసరించే నైతిక ప్రమాణాలను సవరించాలని జీవితం నాకు ఉద్బోధించింది. సమాజగౌరవం పొందుతూ, గొప్ప పదవులలోఉండి, బహునీచమైన నైతిక జీవితం గడుపుతున్నవారిని నేను చూచాను. వీరు బాహ్యంగా సమాజం కట్టుబాట్లను పాటిస్తూ, రహస్యంగా క్షుద్రమైన జీవితం సాగిస్తున్నారు. కేవలం క్రౌర్యం వల్లనో, దురాశ, స్వార్థపరత్వాల ప్రేరణవల్లనో, వీరు పలువురి వినాశనానికి కారకులయ్యారు. శాసనాలు అంటలేని ఘోరనేరాలు వీరి చేతులమీదుగా జరిగాయి. వీరి దుర్నయాలు ఎరుగనివారంటూ లేకపోయినా, సమాజంలో తరచు ఉన్నతపీఠమే వీరికి లభిస్తున్నది. ఇలాంటివారిని ఉపేక్షించటం, వారి తప్పిదాలను క్షమించటం, నేరమని నాకు చాలా సార్లు అనిపించేది. ఆహారపదార్థాల కల్తీకి పరోక్షంగానైనా బాధ్యుడైనవ్యక్తి యదార్థానికి వందలాదిప్రజలపాలిట హంతకుడు. అతణ్ణి గౌరవించరాదు సరికదా, నికృష్టమైన నేరస్థునకు విధించే శిక్ష విధించాలి. లంచం పుచ్చుకునే ఉద్యోగి మామూలు దొంగకంటేను, బందిపోటుదొంగకంటేను నీచమైననేరం చేసినవాడవుతాడు.

కాని ఇలాంటివారందరూ సమాజంలో అగ్రశ్రేణిలో ఉంటున్నారు. ఈ సాంఘిక జాడ్యాన్ని నిరోధించలేక నేను సహించి ఊరుకోవలసి వస్తున్నది. ఇలాంటి భావాలవల్లనే మానవులపై నా విమర్శనాత్మకవైఖరి కొంతవరకు సడలింది. చాలామందిలో మంచీ, చెడూ రెండూ మిళితమై ఉన్నాయని ఈనాడు నేను విశ్వసిస్తున్నాను. ఏ మనిషి కళంకరహితుడైన దేవదూతకాడు; క్రూరాతిక్రూరుడైన రాక్షసుడూ కాడు.

అనిష్టమైన సత్యం చెప్పగల ధైర్యం ఉన్నవారూ, అంతరాత్మప్రబోధాలను పాటించేవారూ బహు తక్కువ మంది ఉన్నారు. జీవితం నాకు నేర్పిన మరొక విచారకరమైన పాఠం ఇది. అపురూపమైన ఈ సద్గుణాల విలువ ఏమిటో సమాజం గుర్తించలేకపోయింది. అవి లేకపోవటం గర్హనీయమనిగాని, దోషమనిగాని సాధారణంగా భావించటంలేదు. తప్పు చేసినవారు ఎవరైనప్పటికీ కనీసం మాట మాత్రంగానైనా నిరసన తెల్పాలనే ఉద్వేగం మనలో బొత్తిగా కన్పించటంలేదు. తమ సంక్షేమానికి ప్రమాదం ఏర్పడనంతవరకూ అన్యాయాలూ, అక్రమాలు ఘాతుక చర్యలు, ఎన్ని జరిగినా, చూస్తూకూర్చునే ప్రముఖులు ప్రతిరంగంలోనూ ఉన్నారు. వీటితో తమకు నిమిత్తంలేదని వీరు ఊరటచెందుతారు. సజ్జనుడంటే, ఇతరుల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోనివాడనీ, ఎవరితోనూ కలహం పెట్టుకోనివాడనీ, పరుషంగా మాట్లాడనివాడనీ మన అభిప్రాయం కాబట్టి, ఇలాంటివారిని సమాజం అభిమానిస్తోంది. అక్రమాలను సహించి ఊరుకొనడానికి మామూలుగా చెప్పే సాకు వాటిని ఎదిరించి ప్రయోజనం లేదని. "ఫలానావారిని నిరసించి నేను సాధించగలిగే మేలు ఏమీ ఉండకపోగా, అనవసరంగా వారి ఆగ్రహానికి గురికావలసి వస్తుంది" అని అనుకోటం మనం తరుచు వింటుంటాం. ఈ విధమైన సంజాయిషీలు నన్ను పలుమార్లు ఆగ్రహావేశపరుణ్ణి చేశాయికాని, బలీయమైన విధికి క్రమేణా తలవంచటం నేర్చుకున్నాను. ఈ సందర్భంలో కనీసం బాహ్యజీవితంలో, పాశ్చాత్యులకంటే మన స్థితి ఎంత హేయమైనదిగా ఉన్నదో విదేశాలకు వెళ్ళివచ్చిన తరువాత నాకు తెలిసింది.

నెమ్మదినెమ్మదిగా నా మానసాకాశంలో సాక్షాత్కరించి, నా జీవితానికి ఉపశమనం కలిగిస్తున్న పరమ సత్యాన్ని ప్రస్తావించి ఈ వ్యాసం ముగిస్తాను. అది భగవద్గీత ప్రవచించే సత్యం. "నీ కర్తవ్యం నీవు నిర్వహించి, మిగిలినది భగవంతునకు విడిచిపెట్టు. నీవు కేవలం భగవంతుని బంటువని విస్మరించకు. నీవు నీ కర్తవ్యం పాటించేటప్పుడు, నీ ద్వారా భగవంతుడు ఆపని జరిపిస్తున్నాడుని భావించి, ఫలితం సంగతి ఆలోచించకు. మతసంబంధమైనదా కాదా అనే విషయంతో నిమిత్తంలేకుండా ఏదా నీ కర్తవ్యమని భావిస్తావో, దాన్ని నిర్వహిస్తే చాలు. కర్తవ్యపాలనం భగవధారాధనా పద్ధతులన్నిటిలోనూ శ్రేష్ఠమైనది." ఇందులో ఎంత బలమైన తాత్విక జిజ్ఞాస ఉన్నదో, ఇది వివేకవంతమైనమార్గం అవునో కాదో నేను చెప్పలేను. కాని ఒక్క సుగుణం మాత్రం నాకు కనిపిస్తున్నది. దీనివల్ల నాకు మనశ్శాంతి లభిస్తోంది. ఆందోళన, సందేహాలు నన్ను వేధించకుండా కాపాడుతున్నది. నా మానసిక, శారీరక జవసత్వాలు వట్టిపోకుండా రక్షిస్తోంది. భగవద్గీత బోధల ననుసరించి, జీవితం గడపటం అంత సులువైన పనికాదు. కాని క్రమేణా నా మనస్సును ఈ మార్గంలోకి త్రిప్పుకుంటున్నాను. లక్ష్యాన్ని సమీపిస్తున్నకొద్దీ జీవితంలో అధికతరమైన ఆనందం సమకూరుతున్నది. దుఃఖాన్నిగూర్చిన ఆలోచనలు తగ్గిపోతున్నాయి.

భక్తి, శ్రద్ధలతో పనిచేసి, ఆందోళనచెందకుండా ఉండటమే ఉత్కృష్ట లక్ష్యమని జీవితం నాకు బోధించింది. ★

## మురళీ-ఏప్రియల్ ఒకటి

9–వ పేజీ తరువాయి

అసలు ఏం జరిగిందంటే !! ?

మార్చి 31 వ తేదీ సాయంత్రం శారద సంతకంతో మురళికి ఓ నీలిరంగు కవరు అందింది (ఆ విషయం నేను మురళికి చెప్పలే దనుకో).... ఏప్రియల్ ఒకటో తారీఖు పొద్దున్నే అన్నాడు మురళి "సాయంత్రం సినిమాకు వెడదామా ?" అని నా మటుకు నాకు నిజం చెప్పొద్దూ !? వేసిన ప్లానూ — వ్రాసిన నీలిరంగు కవరూ దండుగే అనిపించింది. లేకపోతే ఆ ఉత్తరం అందినా సాయంత్రం సినిమాకు వెడదాం అనడం ఏమిటి?

సాయంత్రం బట్టలు వేసుకుని ఔటు గేటు చేరుకున్నాం టౌను పోవడానికి.

"రామకృష్ణా—నాకు లేబ్‌లో కొంచెం పనుంది. మీరు టౌను వెళ్లి టిక్కెట్లు రిజర్వ్ చెయ్యండి. నేను థియేటరులో కలుసుకుంటాను" అన్నాడు మురళి.

వెంటనే యిదంతా మురళి మమ్మల్ని వద లించుకోడానికి ఆడుతున్న నాటకం అనిపించింది.

నేను, కృష్ణా ఒకరి మొహం ఒకరు చూసు కున్నాం.....

నేను గోపాలపారావుతో .... "నువ్వూ, కృష్ణా రావూ టిక్కెట్లు తీసుకు అట్టే పెట్టండి. నేను ఒక్కమాటు సిరిపురం వెళ్లి వస్తాను. కృష్ణ నాకు కంపెనీ ఉంటాడు." అన్నాను.

వాళ్లు ఒప్పుకున్నారు. అందరం కలిసి కిర్లం పూడి హాస్టలునుంచి ఔటుగేటు చేరుకున్నాం.

మురళి "నేను వస్తాను రూమ్‌మేట్స్, థియేటరులో కలుకుకుంటాను' అంటూ కాలేజీ లోకి వెళ్లిపోయాడు.

వచ్చిన నంబర్ టెన్ బస్సులో రెండే సీట్లు మిగలడం మా అదృష్టం — వేం సిరిపురం నడచి వెళ్లిపోతాం. మీరు బస్సు ఎక్కండని గోపాల రావునీ — కృష్ణారావునీ బస్సు ఎక్కించి టౌను పంపించేశాం.

నేనూ, కృష్ణ 'విద్యారామం' లో కాఫీ త్రాగుతూ కూర్చున్నాం, ఔటు గేటు వైపే చూస్తూ .... వో పావు గంటకల్లా మురళి గంతు లేసుకుంటూ కాలరు సర్దుకుంటూ కంగారుగా బయటకు వచ్చి ఇటూ అటూ ఓసారి చూసి, ఓమాటు వాచీ చూసుకుని నడవడం మొదలు పెట్టాడు.

కృష్ణ, నేనూ అనుకున్నాం—మురళి టౌను దాకా ఏమైనా నడవడు, అవుసరం అయితే టౌను వెళ్లడం మానేస్తాడు కానీ. అందుచేత తప్ప కుండా స్కాండల్ పాయింట్‌కే అయ్యుంటుంది అని. మురళి మెల్లిగా పిఠాపురం హాస్టలులోకి మళ్లాడు. వెంటనే మురళి అక్కడికే వెళ్ల

టున్నాడని నిర్ధారణ అయిపోయింది జాగ్రత్తగా వాడిని అనుసరించాం వాడికి కనుపించకుండా దానికి తోడు వాడు ఎక్కడ లేటు అయిపోతానో న్నట్టు, వెనక్కు తిరగనైనా తిరుగకుండా నడుచుకుపోయాడు స్కాండల్ పాయింట్ ఓ వందో రెండొందలో గజా లుందనగా మేం ఇద్దరం ఆగిపోయాం . నేను ఏదో పరధ్యానంగా ఉన్నాను అంతలో కృష్ణ "కొంప మునిగింది శారద అన్నాడు

అటువైపు చూశాను శారద ఒంటరిగా కూర్చొని ఉంది మురళి ఆర్ కే మిషన్ దాకా వెళ్లి బీచి మీదకు వచ్చి శారదవైపు నడవడం మొదలుపెట్టాడు . మేము కలలో కూడా ఊహించని ఆ సన్నివేశానికి బిత్తరపోయి ఏం చెయ్యాలో తోచక ఇసుకలో కూలబడ్డాం .

కృష్ణ అన్నాడు "ఏం రూమ్‌మేట్ మురళిని పిలిచి నిజం చెప్పేద్దామా !" అని నేనూ లోపల అలాగే అనుకున్నా .

'ఆc! మన మురళీ విషయం మనకు తెలియందేముంది ... వాడి ధైర్యం మనకు తెలియందేమిటి ! (అందులో అమ్మాయిల సంగర)" అని వర్దేశాడు

మురళి ఓ రెండు సార్లు ఇటూ అటూ అక్కడే తచ్చాడి చివరకు ఆ అమ్మాయి దగ్గర ఆగిపోయాడు ఆ అమ్మాయి లేచి నిలుచుంది మేం దూరంగా ఉండటంవల్ల ఏం మాట్లాడు కున్నారో వినిపించలేదు అయితే ఆ రెండు విగ్రహాలూ ఓ అయిదు నిముషాలు దగ్గర దగ్గరగా కనుపించాయి ఆ తరువాత ఆ అమ్మాయి లేడీస్ హాస్టలు వైపూ మురళి బస్ స్టాప్ వైపూ వెళ్లిపోవడం చూశాం

మురళి రూమ్‌కి వెళ్లిపోతున్నాడని గ్రహించి మేం మెల్లిగా టౌనువైపు దారితీశాం బాజార్లో నాలుగుసార్లు అటూ ఇటూ తిరిగి సినిమా వదిలే సమయానికి లీలా మహల్ దగ్గర గోపాలరావునీ — కృష్ణారావునీ కలుసుకున్నాం — గోపాలరావుకి మమ్మల్ని చూడగానే — మొహం ఎర్రబడిపోయింది జేబులో నుంచి మూడు టిక్కెట్లు తీసి "మీవల్ల చూశారా ! మూడు టిక్కెట్లు దండుగ" అంటూ మాకోసం కొన్న మూడు టిక్కెట్లూ మొహాన్న విసిరాడు

"అంత అవసరమైన పనులుంటే — సినిమాకి డెఫెనెట్‌గా సినిమాకు వస్తామని చెప్పడం ఎందుకూ ? మురళీ ఏడీ ? వా డెక్కడికి పోయాడూ !?" అంటూ విరుచుకుపడ్డాడు కృష్ణారావు

"సారీ రూమ్‌మేట్స్, ఇవేళ తారీఖు ఒకటి" అన్నాను

"అయితే" అన్నాడు కృష్ణారావు కోపంతో.

"అయితే లేదు — గియితే లేదు ఏప్రియల్ ఫూల్సు అయ్యి యింకా కోపం ఎందుకూ ! ?" అన్నాడు కృష్ణ నవ్వుతూ

గోపాలరావు కోపం మంచుగడ్డలా కరిగిపోయింది "నిజమే రూమ్‌మేట్స్ అసలు విషయము మాకు తట్టనేలేదు ఎనీవే కంగ్రాచులేషన్స్—గొప్పగా ఫూల్స్ చేసారు మమ్మల్ని" అనేశాడు నవ్వుతూ

రూమ్‌కి వచ్చేసరికి మురళి మూడో ఝాము నిద్రలో ఉన్నాడు మర్నాడు పొద్దున్న మురళి "ఐ యామ్ సారీ రూమ్ మేట్స్ లేట్‌లో చాలా పని తగిలింది రాలేకపోయాను" అనేశాడు ఓ రెండు రోజుల వరకూ "ఏం మురళీ బీచిలో ఏం జరిగింది ?" అని అడుగుదామనిపించింది

అయితే— "ఇదంతా చేసింది మీరేనా—! ఫూల్స్ బుద్ధిలేకపోతే సరి" అని ఎగురుతాడేమో, అనిపించింది

ఏమయినా ఓ వారం రోజులు గడిచిపోయాయి.

అప్పుడప్పుడు మురళి "ఇవేళ మనం బీచికి పోవద్దు—రూమ్‌లోనే లిటరేచర్ ఆడుకుందాం" అనేసి సాయంత్రం రూమ్‌కి రాకుండా లేట్‌గా వచ్చి "సారీ ఏదో పని తగిలింది" అని సాకులు చెప్పుకునేవాడు ఓ రెండు, మూడు సార్లు ఇలా జరిగేసరికి నాకూ, కృష్ణకూ అనుమానం వచ్చింది అసలు సంగతి ఏమిటో తెలుసుకుందామని మురళి లిటరేచర్ ఆడుదాం అన్న రోజున బీచి మీదకు బయలుదేరాం నేనూ, కృష్ణానూ

దూరంగా మురళీ, శారదా మాట్లాడుకుంటూ నడుస్తున్నారు దగ్గర దగ్గరగా నేనూ కృష్ణా కళ్లు మరింత పెద్దవి చేసుకుని చూసి ఆ అమ్మాయి శారదేనని నిర్ధారణ చేసుకుని ఒకళ్ల మొహం ఒకళ్లు చూసుకుని హాస్టల్‌కి తిరిగి వచ్చేశాం

రోజులు గడుస్తున్నాయి .. మురళి, శారదల స్నేహం బాగా ఎక్కువై ఉంటుందని మేం వూహించాం మురళి ఓ వారం రోజులు సెలవు పెట్టి ఇంటికి వెళ్లాడు నేనూ, కృష్ణ, అనుకున్నాం—

ఇంక రిసెర్చి ఏం చేస్తాడూ! అని వారం రోజులు సెలవు, మరో ఇరవై రోజులు పొడిగించాడు తరువాత నాకు నిన్ననే తన పెళ్లి శుభలేఖా, చేతి ఉత్తరం పంపించాడు ఆ ఉత్తరం చదువుతే తక్కిన కథ నీకే అర్థ మవుతుంది మురళికి యిప్పటికి కూడా శారద పేరుమీద ఉత్తరం వ్రాసిందీ, ఆ ధైర్యం ఉన్నదీ — నాకేనని గట్టి నమ్మకం అసలు ఆ ఉత్తరానికి బ్రైన్స్ బిహైండ్ నీవేనని తెలియదు—పాపం

ఇంక ఏం వ్రాయను !? మురళి పెళ్లికి మవ్వు తప్పకుండా వస్తావనుకుంటాము. తతిమా

ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రకటనలు
మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి

# నవలావణ్య చర్మ సౌందర్యం మీ కొనవ్రేళ్ల మీదవున్నది.

మీరు చర్మ సౌందర్యము పట్ల శ్రద్ధ వహించండి! దానిని
నవలావణ్యమైన సొగసుగానుండునట్లు హిమాలయా బుకే స్నో
తో బాగా పోషించుకోండి. అది అర్చుకుపోయి వాడిలిన
చర్మమునందు కొత్త జీవం పోస్తుంది. హిమాలయా బుకే
స్నో మీ చర్మ సౌందర్యమును ఎండ గాలి మొటిమలు,
ముడతలు బారినుండి గుణవంతంగా కాపాడుతుంది.
మీ చర్మ సౌందర్యము పట్ల తగిన శ్రద్ధ వహించండి
దానిని నవలావణ్యంగా వుంచుకొనుటకు ఉపయుక్తమైనది

## హిమాలయా బుకే స్నో









HBS 22-X52 TL

లండన్‌లోని ఇరాస్మిక్ తరపున హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ చేత భారతదేశంలో తయారుచేయబడినది.

# మురళీ-ఏప్రియల్ ఒకటి

విషయాలు కలుసుకున్నప్పుడు మాట్లాడు కుందాం.

జవాబు వ్రాస్తావు కదూ!

"శాస్త్రి."

శాస్త్రి ఉత్తరం చదవడం పూర్తిచేసిన రామకృష్ణ మురళి శాస్త్రికి వ్రాసిన ఉత్తరం చదవడం మొదలుపెట్టాడు.

ప్రియమైన శాస్త్రికి,

బహుశా: నా పెళ్లి శుభలేఖ నీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. నా వివాహానికి ఓ విధంగా కారకుడవు నువ్వే. ఆ విషయం నీకు చాలా రోజుల క్రితమే చెబుదా మనుకున్నాను. అయితే నువ్వు పూర్తి వివరాలు నాకేమీ తెలీదనే ఉద్దేశ్యంలో ఉన్నావు. ఇప్పుడు తగిన సమయం వచ్చింది కాబట్టి వ్రాస్తున్నా.

మార్చి 31 వ తారీఖున నాకు ఓ నీలిరంగు కవరు వచ్చింది నిజంగా ఆ ఉత్తరం చూడగానే నిజమో, అబద్ధమో కూడా ఊహించలేకపోయాను. అయితే నాకు శారద దగ్గర నుంచి అటువంటి ఉత్తరం రావడం అసంభవం అనిపించలేదు కారణం శారద నాకు అంతక్రితమే తెలుసు హాస్టల్‌లో మా చెల్లెలుకి స్నేహితురాలు నేను ఫలానా అని శారదకు తెలుసు, శారద ఫలానా అని నాకు తెలుసు. ఒకమాటు పరిచయం చేసింది కూడాను నేను ఎప్పుడైనా, ఏ బజార్లోనైనా, సినిమా హాల్లోనైనా కనుపిస్తే మా చెల్లెలికి చెప్పేదిట నేను కనుపించినట్టు అసలు ఆరోజు ఉత్తరం చూడగానే మరురోజు ఏప్రియల్ ఒకటి అన్న విషయం కూడా మర్చిపోయాను—అదే మంచిది అయ్యింది నాకు

ఏమయితే అయ్యింది అని మరు రోజు సాయంత్రము మిమ్మల్ని సినిమాకి పంపించేసి నేను బీచికి వెళ్లిపోయాను బీచి మీద శారద ఒంటిగా కూర్చుంది. ఉత్తరం శారదే వ్రాసి ఉంటుంది అనిపించింది మెల్లిగా శారద దగ్గరకు చేరుకున్నాను. శారద నన్ను చూడగానే చిరునవ్వు నవ్వింది—నన్ను ఆనవాలు కట్టినట్టు.

నేను ఆ చిరునవ్వును చిరునవ్వుతో అందుకున్నాను.

"ఒక్కరే వచ్చారేం! మీ స్నేహితులు రాలేదా?" అంటూ పలకరించింది శారద.

"అలా అడుగుతా రేమిటి!? వాళ్లని కూడా తీసుకురమ్మని మీ ఉత్తరంలో ఏమైనా వ్రాశారా?" ప్రశ్నించాను.

"ఏ ఉత్తరంలోనండీ!?" కొంచెం బిత్తర పోయి ప్రశ్నించింది. నా మొహం వెలవెల బోయింది ... ఉత్తరం తీసి చూపించాను. ఉత్తరం చూడగానే శారద సిగ్గుతో మొహం కప్పుకుంది చివరికి "ఐ ఆమ్ సారీ! ఆ ఉత్తరం నేను వ్రాయలేదు ..... అసలు ఇవేళ ఏప్రియల్ ఒకటి అన్న విషయం ఇవ్వరం మర్చి పోయాం. హాస్టల్లో ఫ్రెండ్స్ మేం కాలేజీ నుంచి తిన్నగా బీచికి వచ్చాం. నువ్వు బీచిలో ఉండమని నాకు చెప్పారు. నేను ఆమాట నమ్మి బీచికి వచ్చి కూర్చున్నాను. వాళ్ళు రాలేదు .... కూర్చుని ఆలోచిస్తూంటే ఇవేళ ఏప్రియల్ ఒకటి అని జ్ఞాపకం వచ్చింది. తిరిగి వెళ్లిపోదామనుకుంటూంటే మీరు వచ్చారు .... బహుశా మీకు అందిన ఉత్తరం కూడా అటువంటిదే అయ్యుంటుంది" అనేసింది.

"ఐ ఆమ్ సారీ .... ఆ ఉత్తరం మీరు వ్రాసిందే నని నమ్మి మిమ్మల్ని కలుసుకుందామని వచ్చాను. మీరు వ్రాయకపోతే పోనీలెండి .... ఏమయినా ఈ ఏప్రియల్ ఒకటి నేను మరచిపోలేను ... వస్తానండి! గుడ్‌నైట్!" అనేసి హాస్టల్‌కి తిరిగి వచ్చేశాను

తరువాత పది పదిహేను రోజుల్లోనూ మా స్నేహం వింత వింత పరిస్థితులలో పెరుగుతూ వచ్చింది ... ఆ ఏప్రియల్ ఫస్టున నాకు వచ్చిన ఉత్తరం సంగతి మా చెల్లెలుకి కూడా తెలిసి పోయింది నవ్వేసింది మా చెల్లాయి ... పైగా "ఏరా అన్నయ్యా ... ఏమిటి ఈమధ్య నీకు నువ్వే ఉత్తరాలు వ్రాసుకుంటున్నావుట" అంది

మా చెల్లెలు అవులిస్తే పేగులు లెక్కపెట్ట గలదు తన స్నేహితురాలు తనకి వదినగా వస్తే బావుంటుంది అని ఎవ్వ రనుకోరు!? తతిమా కథ నేను వివరంగా వ్రాయడం అనవసరం. నేనూ, శారదా బాగా స్నేహితులం అయ్యాం. దానికి తోడు మా చెల్లెలికి పరీక్షలు హడావుడి అవ్వడంతో సాయంత్రం హాస్టలులోనే ఉండి పోయేది నేను, శారదా చాలాసార్లు అనుకోకుండానూ — అనుకుని కూడా అనేకసార్లు కలుసుకున్నాం. చివరకు ఫలితం ఈ శుభలేఖ

శారద ఎప్పుడైతే ఆ ఉత్తరం నేను వ్రాయలేదు అందో వెంటనే మన రూమ్‌మేట్స్‌లో ఎవరో ఒకరు ఈ పని చేసిఉంటారు అనిపించింది ఎవరై ఉంటారా అని ఆలోచించాను. ఈ పని చెయ్యడానికి తగినంత ధైర్యం నీకూ, రామకృష్ణకూ మాత్రమే ఉంది. సరే రామకృష్ణ ఊరు నుంచి వెళ్లిపోయాడు. ఇంక నువ్వే అయ్యుంటావు అని నిర్ధారణకు వచ్చాను. నువ్వు ఏ ఉద్దేశ్యంతో ఆ ఉత్తరం వ్రాసినా ఆ ఉత్తరం కమ్మని ఫలితం తీసుకురాబోతుంది అనిపించింది— అందుకనే అసలు ఆ విషయం మీతో ఎప్పుడూ మాట్లాడలేదు. ఆరోజు నువ్వు నన్ను 'ఫూల్' చేద్దామని వ్రాశావు.

అయితే ఆ ఉత్తరం నన్ను ఏప్రియల్ ఒకటి మరచిపోకుండా చేసింది. ఆరోజే మా ప్రణయానికి నాంది.

ఇంకేం వ్రాయనూ? తప్పకుండా పెళ్లికి వస్తావని ఆశిస్తాను. వస్తావు కదూ!

"మురళి"

రెండు ఉత్తరాలూ చదివిన రామకృష్ణ ఓ కప్పుడు మంచినీళ్లు త్రాగి మళ్లీ ఏప్రియల్ ఫస్ట్‌కి" నాకూ ఎవరైనా అటువంటి ఉత్తరం వ్రాస్తే?" అనుకున్నాడు ★

# న్యూఢిల్లీ లేఖ

7-వ పేజీ తరువాయి

నైనా ఆర్థిక సమన్వయానికి ఏర్పాట్లు జరగాలని నానాటికి స్పష్టమవుతున్నది. ఇందువల్ల దేశంలో గల సాధన సంపత్తి సాధ్యమైనంత ఎక్కువగా సమీకరించేటట్లు ఉండాలి అంతేకాక, ఖర్చుమీద అదుపు విషయంలో కూడా బాధ్యత గ్రహించగలిగేట్లు చూడాలి ఒక ప్రాంతంలోనైనప్పటికీ వేసే పన్నులన్నీ కేవలం ఒకేరకంగా ఉండాలని చెప్పటం మా ఉద్దేశ్యంకాదు ఒక రాష్ట్రంలో పన్నులు వేయడానికి ఉన్న అవకాశాలు దాన్ని అనుకునిఉన్న రాష్ట్రంలో ఉండకపోవచ్చు ఆ యా రాష్ట్రాల పన్నుల వ్యవస్థలలో అనేక విధములైన సర్దుబాట్లు అవసరం కావచ్చు"

"ప్రతి రాష్ట్రంలోను పన్నులు విధించడానికి గల అవకాశాలను నిర్ణయించడానికి సమగ్రమైన పరిశీలన జరగాలని మా అభిప్రాయం ఆ యా పన్ను వ్యవస్థలను సమీక్షించి, రాష్ట్రాల జాబితాలో ఉన్న వివిధ పన్నులకు రేట్లు సిఫార్సు చేయాలి. ఈ పరిశీలనా వ్యవహారాన్నంతటినీ ఒక స్వతంత్ర సంఘానికి అప్పగించటం ఉచితం.

"పరిపాలనా, సాంకేతిక, కార్య నిర్వహణ యంత్రాంగాలు మరింత సమర్థతతోను, త్వరితంగాను, పని చేయాలంటే వాటిని మరమ్మతు చేయవలసిన ఆవశ్యకత ఉన్నది బృహత్ ప్రణాళికలు మంజూరు చేయించుకోవాలనే ఆదుర్దా రాష్ట్రాలకు ఉండటంసహజమే అందుకుగానుతమసాధనసంపత్తిని—ప్రస్తుతం ఉన్నవి,అదనంగా సమాకూర్చేవి—హెచ్చించి చెప్పే ధోరణి కనిపిస్తున్నది అంతేకాక, అమలు చెయ్యలేని పొదుపును కూడా పేర్కొంటున్నాయి. ప్రణాళికాబద్ధమైన ఆర్థిక వ్యవస్థలో సైతం ప్రణాళికతో నిమిత్తంలేని ఖర్చు-విశేషించి పరిపాలనా యంత్రాంగంకోసం అయ్యే ఖర్చు—ప్రాముఖ్యం ఎంతైనా ఉన్నది ప్రణాళిక ఖర్చులకు ప్రణాళికతో నిమిత్తంలేని ఖర్చులను ఒక్క నిష్పత్తిని ఏర్పాటుచెయ్యాలి ప్రభుత్వ యంత్రాంగాన్ని పునర్వ్యవస్థీకరించవలసిన అవసరం గుర్తించాలి ఇవి రెండూ జరుగకపోతే ప్రణాళికకే ప్రమాదం ఏర్పడుతుంది. సకాలంలో పథకాలు అమలు పూర్తి కాకపోవటమో, చేసిన ఖర్చుకు తగిన ఫలితం లభించకపోవటమో జరుగుతుంది"

రాజ్యాంగంలోని 282 అధికరణంక్రింద పెద్ద ఎత్తున ప్రస్తుతం ఇస్తున్న గ్రాంట్లకు కూడా ఆర్థిక సంఘం అభ్యంతరం తెల్పింది. "కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలమధ్య ఆదాయం పంపిణీకి వర్తించే రాజ్యాంగం సూత్రాలతో 282 అధికరణానికి నిమిత్తంలేదు కలగాపులంగాఉన్న ఆర్థిక సూత్రాలలో ఇది ఒకటి అత్యవసర పరిస్థితులలో మాత్రమే దీనిని అనుసరించవచ్చుగాని, ఇప్పటివలె అనుసరించరాదు

ఆర్థిక సంఘం వాదాన్ని అంగీకరించేపక్షంలో విద్య, ఆరోగ్యం, నీటి పారుదల, వ్యవసాయం, సమాజాభివృద్ధి మొదలైన రాష్ట్ర విషయాలతో వ్యాపారం సాగించే శాఖలన్నింటిని రద్దు చేయవలసి వస్తుంది. ★

# సరాగమాల

## వి ఎ కె రంగారావు

గ్రామఫోన్, రేడియోలు వచ్చిన తర్వాత సంగీతం అందరికీ అందుబాటులో ఉంటున్నది! రికార్డు సంగీతం మన నిత్యజీవితంలో అతిముఖ్యంగా ఉంటున్నది దీనిని దృష్టిలో ఉంచుకుని గ్రామఫోను రికార్డులకు సంబంధించిన వార్తలు ఈ శీర్షిక క్రింద ప్రచురింప నిశ్చయించాము

శ్రీ రంగారావు గారివద్ద కొన్ని వేల రికార్డులు ఉన్నాయి! ఈ శీర్షిక డిజైన్ వేసినవారు శ్రీ బాపు

గౌతమీవారు భారీఎత్తున నిర్మిస్తున్నచరిత్రాత్మకము "తిమ్మరుసు" చిత్రంకోసం క్రిందటివారం రెండుపాటలు భరణీ స్టూడియోలో కోటీశ్వరరావు రికార్డుచేశారు మొదటి యుగళగీతం ఘంటసాల, లీల పాడిన "తథాస్తుస్వాముల కొలవండీ, ఒస్తివాస్తుల తెలియండీ" అనే ఆరభిరాగతత్వం, పింగళి సాహిత్యం ఈ పాట వింటుంటే "పెళ్ళిచేసి చూడు" లోని "మనసా నే నెవరో నీకుతెలుసా" గుర్తుకు వచ్చింది వరసలపోలికలవలన కాదు రెండూ పింగళరచనలు రెండిటిలోకూడ వేదాంత, ఆధ్యాత్మిక పదజాలంతోనే యేర్పడిన మెత్తని హాస్యంవుంది కనుక

సంగీత దర్శకులు, (శాస్త్రీయ సంగీతాన్ని లలితంగా కూర్చి పాటలను జనాదరణ పొందించటంలో మార్గదర్శకులు,) పెండ్యాల సమకూర్చిన వాద్యానుసరణ హాయిగా, తేలికగావుంది పాటకంతకూ వింతవన్నె తెచ్చినది మధ్యనఉన్న "హరిఓం హరి ఓం" అన్న ముక్కలు

రెండవ పాట ఎస్ వరలక్ష్మి, సుశీల పాడిన శాస్త్రీయగీతం మధుర స్వరాలతో మృదుల స్వరాలతో పెండ్యాల మరొక లోకమే సృష్టించారు మరి జన్మలో మపురానివి అనుకున్న "మదిశారదాదేవి మందిరమే" (జయభేరి), "శివశంకరి" (జగదేకవీరునికథ)లనే మరపించేదిగావుందీపాట

*　　*　　*

ఈ మధ్యనే నవశక్తివారి రెండవపౌరాణిక చిత్రానికి ఒక యుగళగానం చిత్రీకరించబడినది అశ్వత్థామ సంగీతానికి మల్లాది సాహిత్యం వీరిద్దరి జోడీ ఇంతకుముందు చాలాఅసాధారణమైన పాటలను అందించింది "సరసాల వేళలో చెరసాలే సుఖమేమో" (రేచుక్క), "అందానికి అందం నేనే" (చివరకు మిగిలేది), అన్న పాటలు సంవత్సరాల తరువాతైనా స్మృతిపథపు చివరిటంచుల్లో, ఆనందపు జాడల్లో, అనురాగపు నీడల్లో ఎక్కడో మగత నిద్రలో మాధవుని తలపులాగ మెదులాడుతునే వుంటాయి

ఈ చిత్రంలో మొత్తం ఎనిమిదిపాటలు ఉంటాయి ఘంటసాల, జానకి, లీల, వైదేహి, మాధవపెద్ది, జిక్కి, ముక్కామల, సునంద పాడతారు ఇంతవరకు ఆరుపాటల రికార్డింగు, చిత్రీకరణ పూర్తిఅయింది

"కృష్ణా" అను పిలుపుతో ప్రారంభ మౌతుంది "గాలిమేడలు"లో మనోహరమైన పాట రేణుకది తెలుగుసినిమాలో విరిసిన ఒక క్రొత్త కంఠం లింగప్ప సంగీతం యెప్పటిలాగానే క్రొత్తక్రొత్త సంగతులతో వినేవాళ్లను పలకరిస్తూ, పులకరింపజేస్తూ "కలను కన్న గాలిమేడ యిలను నిలిచె" నంటూ సుధా వాహిని ప్రవహిస్తుంది పల్లవి అనుపల్లవులకు వాద్యానుసరణ పాశ్చాత్య ధోరణిలోను చరణాలకు హిందూస్తానీ బాణీలోను వున్నా వెగటనిపించటం లేదు ఆమేళవింపు అంత కమ్మని గుబాళింపుతో చేశారు లింగప్ప

ఈ రికార్డు రెండవప్రక్క ఒక చక్కని డ్యుయెట్ వుంది ప్రేమికుల మనస్సుల మమతల రహస్యపు లోతులలోనో తొంగిచూచి "నవరాగాలు పాడెనీవేళ" వ్రాశారు రాప్సండ్ అంటే "మగవారి మాయలు" చిత్రంలో హాయియనిపించిన మూడు నిముషాల నిషాలమాల "అందాల సొగసుల రాధను, అనురాగాల భావాల గాధను" అన్న పాట రచయిత

ఇక శ్రీనివాస్, సుశీల, కంఠాల కలయిక కారుమబ్బులకు సిరెండపెట్టిన జలతారు అంచు గ్రీష్మంతాన తొలి వర్షానికి మతి వసంతామన్న వనమయూరి ఆడిన ఆట, ఒక సి రామచంద్ర పాట అంతకన్న విశేషణాలు మరేమిటుంటాయి పాటకు లింగప్ప ఏర్చికూర్చిన రాగం తన స్వతంకాదు, కానేరదు తొలిప్రేమల పరాగంతో స్పందించిన యేవన్నెకాని సరాగమాల లోని రాగమో ఈ చౌర్యానికి లింగప్పను అభినందించని సంగీతప్రియు లుండరు ఈ రికార్డు నంబరు జి ఇ 35257

### జి ఇ 35258

మోహినీ—రుక్మాంగద చిత్రంలో సాహిత్యా సంగీతం సమాన స్థాయిలో వున్న పాటలు రెండు అవిగాక సాహిత్యానిదే కాస్త పైచే యనిపించుకున్న పాట "మనసైన వీరా" సుశీల పాడినపాటను గమనించి వింటుంటే, యేదో మత్తుగా, ఏవో మధురోహలు ఉవ్వెత్తుగా పొంగుతున్నట్లు అనుభూతి కలుగుతుంది దీనికి చాలామట్టుకు కారణం మల్లాది వ్రాసిన పసందైన సాహిత్యం, మిగిలింది మోహిని నృత్యం కాకపోయినా, మోహినినే మోహింపజేయగలిగిన బాలయ్య చూపిన శృంగారోత్సాహాభినయం. సంగీతంకాని వాద్యానుసరణగాని ఉండవలసినంత శాస్త్రీయపధాన లేవు

రెండవ ప్రక్కనున్న "రాజనిమ్మలపండు" హాస్యగీతమైనా కొసరాజు రచనలో అశ్లీలత ఎక్కడా ధ్వనించలేదు ఘంటసాల అమర్చిన వరుసలోనైతేనేం మాధవపెద్ది, స్వర్ణలత పాడటంలోనైతేనేం అవలేని వూపు, పట్టలేని సంతోషం ఉబికిపోతున్నాయి

### జి. ఇ 35219

శ్రీ సుబ్బరాయన్‌గారు కీర్తిశేషులైన తరువాత ఆంధ్రప్రజ సంగీతంలో కొత్తదనంగాని వాద్యరచనలో మెత్తదనంగాని మరచిపోయారు వారి అనుచరులైన విశ్వనాథన్—రామ్మూర్తి అప్పట్లో చేసినన్ని తెలుగు చిత్రాలు యిప్పుడు చేయుటంలేదు గత నెల విడుదలైన "పెండ్లితాంబూలం"లో పాటలన్నీ ఆణిముత్యాలు ఏ గంధర్వలోకానో వున్న ఆసుబ్బరామన్ విని శెభాషనేలా వున్నాయి

సుశీల, శ్రీనివాస్ పాడిన అనిసెట్టి సాహిత్యం "చల్ బడే మజా" భలే మజాగా, తాజాతాజాగా వుంది రకరకాల వాద్యాలు, వివిధసుగంధద్రవ్యాలు తాంబూలానికి చెప్పరాని రుచి కలిగించేట్లు, ఈ పాటకు వింత అందాన్నిచ్చాయి చాలామంది సంగీత దర్శకులు దృష్టిలో పాశ్చాత్య వాద్యరచన అంటే చెవు లదిరేలా చిన్న పిల్లలు బెదిరేలా హోరు ఎత్తించడమే కాని విశ్వనాథన్—రామ్మూర్తి ఆర్కెస్ట్రేషన్ తీయని తేనియలా వెన్నెల సోనలా అలరిస్తోంది

ఈ చిత్రంలోనే మరొకపాట ఈశ్వరి, శ్రీనివాస్ పాడిన క్లబ్ డాన్సు ఒకటుంది సంగీతం యెంతో మధురంగా వుండటమే కాకుండా అనిసెట్టి సాహిత్యం మణిదీపంలా, మల్లెల పందిరిలా మెరుస్తూ మురుస్తూ వుంది త్వరలోనే రికారు గావచ్చే సూచనలు వున్నవి విడుదల కాగానే నంబరిస్తూ వ్రాస్తాను 

## ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక

శుభకృతు సంవత్సరం ఉగాదికి ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక ప్రముఖులయిన సాహిత్యవేత్తల నాటకములతో, కథలతో, వ్యాసములతో కవితతో సర్వాంగ సుందరంగా వెలువడుతోంది

ఈ సంచికలో ప్రముఖ చిత్రకారుల త్రివర్ణ చిత్రములు ఒక ప్రత్యేక ఆకర్షణ!

పాఠకులు వెంటనే ఏజంట్ల వద్ద తమ కాపీలను రిజర్వు చేసుకోవడం మంచిది

సంచిక వెల రు 2-0-0

## శ్రీ సాయిభక్తులకు

శ్రీ "పేరూరుశర్మ" గారి ప్రసిద్ధరచనలు (1) శ్రీ సాయిప్రభ అను సాయి సచ్చరిత్ర (నిత్య పారాయణ గ్రంథం) రు 3-50 (11) శ్రీ షిర్డీ సాయినాథ మాహాత్మ్యం (వేదోక్త పూజా వ్రతకల్పం) రు 1/- కొద్ది ప్రతులు మాత్రమే అమ్మకానికి సిద్ధంగావున్నాయి! పోస్టేజి అదనం

శ్రీ సాయి రిలీఫ్ సర్వీసు
Po కాకినాడ

## ఉచిత బహుమానం
మీ వార్షికోత్సవం కోసం



ఈ సీల్ కేస్‌గం ఫ్రీల వాచి (వ్యాప్) మీ భార్యకు మరియు మీ కుమారునికి ఉపయుక్తమైనది ఉచితంగా పంపబడును. మీరు దిగువ క్యాలెండర్ వాచీలలో ఏ ఒక్కటికైనా ఆర్డరు యిస్తే చాలు



"మారిసన్" స్విస్ నిర్మాణం. ఆల్ ప్రూఫ్ దాన తల అదే రోజు తేదీలు మారే క్యాలెండర్ గలది సైజులు 9¾ 10½ అండ్ 11 5 వ వత్సరముల గ్యారంటీ

| No | | Jewels | Rs nP |
|---|---|---|---|
| 211 | All steel case | 30 | 116—00 |
| 212 | Rolledgold case | 30 | 111—11 |
| 213 | All steel case | 25 | 110—00 |
| 214 | Rolledgold case | 25 | 105—00 |
| 215 | All steel case | 23 | 99—99 |
| 216 | Rolledgold case | 23 | 97—00 |
| 217 | All Steel case | 21 | 95—00 |
| 218 | Rolledgold case | 21 | 90—90 |
| 219 | Rolledgold case Non W/P | 21 | 88—88 |

ఈ నదుపాయం వ్రాసనదమం

మరల లభించదు

**MORISON WATCH CO,**
232 Dr D N Road Fort,
Tel - 264192 BOMBAY-1

TEL



బట్టలను ఎంతో శుభ్రముగా ఉతుకుకొనుటకు

# నిరాల

బార్ సబ్బు వాడండి




తుంగభద్రా యిండస్ట్రీస్ లి.
కర్నూలు.

ASP/N 3

## మీ అందానికి మంచిదారి



మీ జీవిత విజయాలకు అందం అవసరం ఎండవేడికి యింకా యితరకారణాలవల్ల ముఖం క్రమేపి నల్లబడి ముదిరూపువస్తుంది గ్లోరియా అనే ద్రవము యొక్క అద్భుత సౌందర్య పోషకశక్తి మీ ముఖంలోని అసహ్యమయిన ముదిరూపును పోగొట్టి ఆకర్షణీయమయిన లేతదనాన్ని తెస్తుంది మీ అందం దినాదినాభివృద్ధి అవడానికి నెలకు అదమం కొన్నిసార్లు అయినా గ్లోరియా అనే సౌందర్యపోషక ద్రవాన్ని వాడండి ముఖంమీద మొటిమలను వాటి మచ్చలను ముడతలను నమ్మకంగా పోగొట్టి ముఖాన్ని తెలుపుచేసి కాంతిని అందాన్ని తెచ్చును మొదటి ప్రూతకే మీకు ఆశ్చర్యాన్ని కలిగించే అందాన్నిచ్చుంది ఒకసారి వాడి చూస్తే మీరెప్పుడూ విడువరు. అన్నిషాపులలో దొరకును

**జనితా ప్రొడక్ట్సు - ఏలూరు. (ఆంధ్ర)**

దుర్గా పాసిం

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1, Chief Editor, S, Sambhu Prasad,